

# సృజన

జూలై - నవంబర్ 1985

163 - 165 —167

ఈ సంచిక రు. 4/-

ఈ సంచికలో ....



[అట్టచివరి చిత్రం: కారంచేడులో భూస్వాముల దౌర్జన్యానికి బలైన దుడ్డు వందనం తల్లి ఏలీసమ్మ "కారంచేడు మారణహోమం" పాటల పుస్తకాన్ని ఆగష్టు 15న చీరాలలో ఆవిష్కరిస్తున్నప్పటి చిత్రం]


సృజన, హనుమకొండ-506 001

ఈ సంచిక రు. 4-00

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Printed, Edited & Published by P Hemalatha for 'Sahithee Mithrulu' Printed at Nagendra Press, Vijayawada-520 002. for Venkataramana Mudranalayam, Warangal.

సంపాదకీయం :

# కారంచేడు : పాతస్మృతులు

కారంచేడు వెళ్లివచ్చినవాళ్లకు తప్పనిసరిగా పాత రోజులు జ్ఞాపకం వస్తాయి. కూలివాళ్ల సంఘాలు, కమ్యూనిస్టు పార్టీలు, కనీసవేతన చట్టాలు, భూపరిమితి శాసనాలు లేనిరోజులు గుర్తుకొస్తాయి. ధర్మం నాలుగుపాదాల మీద నడిచి ఎవరి స్థానాన్నీ, ధర్మాన్నీ వారు తు. చ. తప్పకుండ ఆదరించిన రోజులు, ఎవరయినా ధిక్కరిస్తే వాళ్లను నిర్దయగా అణిచేసిన ధర్మసంరక్షకులయిన రాజులు ఏలిన రోజులు, ఏరకపు యిన హక్కులనూ గుర్తించని పరమకర్కోటకుడు మనువు రాసిన మనుస్మృతే ఏకైక రాజ్యాంగం అయిన రోజులుగుర్తు కొస్తాయి.

ఆ రోజులు గుర్తు కొస్తున్నాయంటే రోజులు అసలే మారలేదని కాదు. మారాయి. అనాటి బ్రాహ్మణ ధర్మసూత్రాలు ఏ శూద్రరైతాంగాన్ని అణచడం కోసం ఏర్పడ్డాయో, ఆ శూద్రరైతాంగంలో కొందరు కాలక్రమంలో భూస్వాములయి, తమను తాము సత్‌శూద్రులగా శూద్ర జనసామాన్యం నుండి భిన్నంగా ప్రకటించుకొని ఇప్పుడు బ్రాహ్మణ ధర్మసూత్రాలను బ్రాహ్మణులతో సమానంగా కూలిజనం మీద అమలుచేస్తున్నారు. మరీ తెగబడ్డ వాళ్ళు చారిత్రక ఔచిత్యాన్ని సహితం మరచిపోయి ముఖంమీద ఇంతింత బొట్లు పెట్టుకొని హిందూ ధర్మసంరక్షణం చేస్తామంటూ ఈ మధ్యకాలంలో ఊరేగింపులు తీస్తున్నారు. అందుకే ఇది కులం తగాదా కాదు, భూమి తగాదా అంటున్నాము.

కూతురు పెళ్లికోసమయినా ఏ ఇతరవైదిక సంస్కారం కోసమయినా ఖర్చులు అవసరమయితే శూద్రులనుండి మోసంతోనో బలప్రయోగంతోనో తీసుకోవచ్చునని గౌతముడనే స్మృతికర్త అన్నాడు.

ఇప్పుడే ఫలానా అవసరం లేకపోతే భవిష్యత్తులో రాకపోతుందా! అందుకని వస్తురూపంలో డబ్బురూపంలో శ్రమ రూపంలో ఏరోజుకారోజు రివాజుగా సేకరించడం భూస్వాములు అలవాటు చేసుకున్నారు. సంస్కృతంలో దీనిని విష్టిఅని, తెలుగులో వెట్టి అని, ఉరుదులో బేగార్ అనీ అంటారు. కారంచేడులో పొలాన్ని పాలికి తీసుకున్న హరిజనులు పంటలో మూడింట రెండు వంతులు భూస్వామి పాలు చెల్లించడమే కాక, భూస్వామి ఇంట్లోనూ పొలంలోనూ చేయమన్న చాకిరీ చేయాలట. పాలేరేకాక అతని భార్యకూడ వెట్టికి పశువులను కడగడం నుండి చిన్నపిల్లల అశుద్ధాన్ని శుభ్రం చేయడం దాకా అన్ని పనులూ చేయాలట.

పనిచేస్తానని ఒప్పుకున్న కూలివాడు ఏకారణంగానయినా పనిపూర్తిచేయక వది లేస్తే అతన్ని భౌతికంగా దండించాలని ఆపస్తంబుడనే స్మృతికర్త అన్నాడు. అంతే కాక, అనారోగ్య కారణం వల్లనయినాసరే పని మధ్యలో మానేసి తిరిగి పనిలోకివచ్చి గూడ పూర్తిచేయకపోతే, చేసిన సగంపనికిగూడ జీతం ఇయ్య వలసిన అవసరం లేదని మనుస్మృతికారుడు స్వయంగా అన్నాడు.

కారంచేడులో పాలేర్లు ఒక్కరోజుపనిలోకి పోలేకపోతే భూస్వాములు సాయం కాలం స్వయంగా ఇంటికొచ్చి కొట్టి పోతారంట. పిల్లి సుబ్బారావు అనే యువకుడు ఒక భూస్వామి దగ్గర పాలేరుగా పనిచేస్తూ ఒక్కనాడు పనిలోకి పోనందుకు సాయం త్రం ఇంటికొచ్చి సుబ్బారావులేకుంటే అతని రోగిష్టి భార్య అంకమ్మను కొట్టిపోయా రట. పాలేరుగా ఒప్పుకున్నవాడు 9నెలలు పనిచేసి మానేస్తే, 9నెలలు కాదు, ఒక్క నెల జీతంగూడ ఇవ్వరంట. 'పంట మొత్తం సురక్షితంగా భూస్వామి యింటికి చేర్చే దాకా పాలేరుకు జీతం ముడుతుందన్న నమ్మకంలేదు' అని హరిజనులు వాపోతు న్నారు.

ఈ ధర్మ సూత్రాలకుతోడు, పాలేర్లకు కేవలం 2000 రూపాయలు సంవత్సర జీతం, దినకూలీ ఆడవాళ్లకు 6రూపాయలు, మగవాళ్లకు 10రూపాయలు మాత్రమే ఇస్తుంటే కూలిజనం కనీసవేతనాల చట్టం అమలును సమీక్షించాల్సిన తాసీల్దారు దగ్గరో, కలెక్టరు దగ్గరో ఫిర్యాదు చేసుకోరా?

కోర్టులలో వ్యాజ్యాలు నడిపే అర్హత కేవలం వైదిక సంస్కారాలు పాటించే వారికే (అంటే అగ్రవర్ణాలకే) వుందని బృహస్పతి అనే స్మృతి కర్త అన్నాడు. ఏ వర్ణానికి చెందిన వాళ్లు ఆ వర్ణం వాళ్ళ మీదే తప్ప తమకంటె ఉన్నతుల మీద సాక్ష్యం ఇవ్వడానికి వీలులేదని వశిష్టుడనే శాస్త్రకారుడన్నాడు. చాలా సింపుల్‌గా ఇదే విష యాన్ని కౌటిల్యుడు ఈ విధంగా చెప్పాడు. భృత్యుడు అయినవాడు సివిల్ దావాలలో తన యజమానికి వ్యతిరేకంగా సాక్ష్యం ఇవ్వడానికి వీలులేదన్నాడు.

కారంచేడు హరిజనులకు ఈ సూత్రం ఎవరు చెప్పారో తెలియదు గాని వాళ్లు తమ వేతనాల గురించి ఫిర్యాదు చేయడానికి ప్రయత్నం చేసినట్టు గూడ లేదు. అసలు తమకు ఇస్తున్నది కనీసవేతనం కంటె తక్కువ అని గూడ వాళ్ళకు తెలిసినట్టు లేదు. వాళ్ళకేకాదు, ఆ విషయం జిల్లా కలెక్టరుకు గూడ తెలీదు. ఒక పత్రికావిలేఖరి, కారం

చేడులో కూలిరేట్లు ఏ మాత్రం ఇస్తున్నారని ఆయనను అడిగితే 'అన్నిచోట్లా ఎంతి స్తారో అంతే ఇస్తారుకాబోలు, నాకుమాత్రం ఏం తెలుసు?' అని బదులు చెప్పి, పక్కనే వున్న పోలీసు డి ఐ.జి. గారిని అడగమన్నాడంట.

ఫిర్యాదు చేయకపోతేమానె, అప్పుడప్పుడయినా తిరగబడరా? సంఘటితంగా పోరాడకున్నా మాటకు మాట తిట్టుకు తిట్టు దెబ్బకు దెబ్బ బదులివ్వరా?

అగ్రవర్ణాలవారిని శూద్రులు తూలనాడితే నాలుక తెగగోయమని ఆపస్తంబు డన్నాడు. అక్కడితో ఆగకుండ పది అంగుళాల పొడవున్న ఇనుప మేకును ఎర్రగా కాల్చి నోట్లోకి దూర్చాలని మనువు అన్నాడు. చెయ్యెత్తితే చెయ్యి తెగగొట్ట మన్నాడు, ఉమ్మివేస్తే పెదిమెలు తెగనరకమన్నాడు.

జూలై 17నాడు కారంచేడు భూస్వాముల యువకిశోరాలు సరిగ్గా శాస్త్రప్రకారం ప్రవర్తించారు. తేళ్ళసువార్త అనే మాదిగస్త్రీ, 'తాగేనీటి చెరువులోకి బర్రెకుపెట్టేకుడితి నీళ్ళు ఎందుకు పోస్తున్నావని అడిగింది. మాటా మాటా పెరిగి ఆమెను చండ్రకోలుతో కొడితే దాన్ని లాక్కొని తానూ ఒక దెబ్బవేసింది. హిందూ ధర్మసూత్రాలుగాని, 'ఒక చెంపన కొడితే రెండవ చెంప చూపించమ'నే తమ క్రైస్తవ మత సూక్తిగాని, ఆమెను ఆపలేదు. ఈ అధర్మవర్తనకు ప్రతీకారం మరుసటిరోజు 3000 మంది గొడ్డళ్ళతో బరిసెలతో కర్రలతో మాదిగ వాడమీద దాడిచేసి 6గురు మగవాళ్ళను చంపి ముగ్గురు స్త్రీలమీద అత్యాచారం చేసారు. చాలా క్రూరంగా ప్రవర్తించారు. గొడ్డళ్ళతో నరికి కింద పడేసి పొత్తికడుపులోకి బరిసెలు దించి తిప్పారు. స్త్రీలపై అత్యాచారం చేసి పొత్తికడుపు కింద కర్రలతో పొడిచారు. నిజానికి వాళ్ళకోపం ప్రధానంగా వోట్ల గురించికాదు. సువార్తలాంటి యువకులు పొలంలోనూ గ్రామంలోనూ ఒక రెండేళ్ళనా మాటకుమాట ఎదురుచెప్తున్నారని.

ఇంతకీ ఈ దుర్మార్గులను శిక్షిస్తారా? కారంచేడు ఎన్టీఆర్ బంధువుల గ్రామం కాబట్టి కాంగ్రెస్ (ఐ)వాళ్ళు పెద్ద ఎత్తున గొడవ చేస్తున్నారు. హరిజనులను చంపే హక్కు తమకుమాత్రమే వుందని వాళ్ళ అహంభావం. ఇంతగొడవ జరుగుతున్నా 3000 మంది చేసిన దాడికి అరెస్టులు 30దాటలేదు. నిజానికి ఇంత గొడవ జరుగుతోంది కాబట్టి ఈ మాత్రమయినా జరిగాయి. సి.బి.సిఐడి దర్యాప్తు గూడ జరుగుతోంది, న్యాయవిచారణ ప్రకటించారు. కాని న్యాయం జరుగుతుందా?

కాకినిగాని కుక్కనుగాని గుడ్లగూబనుగాని కప్పనుగాని చంపితే ఎంతపాపమో శూద్రుడిని చంపితే అంతేపాపం అని ఆపస్తంబుడేకాదు, బౌధాయనుడు, మనువు, గౌతముడు గూడ అన్నారు. అగ్రవర్ణాలవారిని చంపితే నష్టపరిహారం (శిక్షకాక) 1000 గోవులు చెల్లించాలి, శూద్రుడిని చంపితే 10 గోవులిస్తే చాలునని ఆపస్తంబుడూ గౌతముడూ అన్నారు. ఇంతెందుకు, ఈ ధర్మశాస్త్రకారులకంటే చాలాపూర్వం, ఐతరేయ బ్రాహ్మణంలో, శూద్రులను ఇష్టానుసారం చంపవచ్చునని (వారు 'యథాకాను వధ్యులు' అని) అన్నారు.

16 ఏళ్ళక్రితం కాబోలు తంజావూరు జిల్లాలోని కిలివెన్మణి గ్రామంలో ఒక ముదలియార్ మిరాస్దార్ మనుషులు హరిజనులను సజీవదహనానికి గురిచేశారు. దేశమంతా గగ్గోలు పెట్టింది. కాని కోర్టు ఆ మిరాస్దార్‌ను విడిచిపెట్టింది. 'ఇంతపెద్ద మనిషి అంత నీచపుపనిచేస్తాడని నమ్మలేకుండా వున్నాం' అని ప్రకటించి మరీ విడిచిపెట్టింది. కారంచేడు కేసు అంతకంటె భిన్నంగా నడుస్తుందా?

హంతకులు కొందరు గ్రామంలోనూ కొందరు హైదరాబాద్ తదితర పట్టణాలలోనూ సురక్షితంగా వున్నారు. తమంతట తాము పోలీసులకు కళ్ళబడ్డ వాళ్ళను అరెస్టు చేస్తున్నారుతప్ప, ఇళ్ళను సోదాచేయడం, బంధుమిత్రులను ఇంటరాగేట్ చేయడం, లాంటి పనులేవీ మొదటి వారంరోజులు పోలీసులు చేయలేదు. ఇదే కూలివాళ్ళు భూస్వాముల ఇళ్ళ మీద దాడి చేసివుంటే (ఆరు హత్యలూ మూడు మానభంగాలూ అటుంచి) ఎంత భీభత్సం జరిగివుండేది? మొత్తం మాలమాదిగ వాడ అంతా చీరాల పోలీస్‌స్టేషన్‌లో ఉండేది కాదా? మాలమాదిగా యువకులందరి మీదా ఉమ్మడిగా కుట్ర కేసు పెట్టివుండేవారు కాదా? తెలంగాణ జిల్లాలను ఇందుకేకాదూ పోలీసు క్యాంపుగా మార్చేసి 'ఎన్‌కౌంటర్లు' చేసి ఇప్పుడు టెర్రరిస్టు ప్రాంతంగా ప్రకటించబోతున్నారు? ఇక్కడ ఇంత భీభత్సం సృష్టిస్తున్న అన్నగారు కారంచేడు హరిజనులకు మాత్రం 'జరిగిందేదో జరిగింది, మరచిపోయి సామరస్యంగా జీవించడ'ని నీతులు చెబుతున్నాడు.

కాని ఒకటి మాత్రం ఈ హంతకులూ, వారి అన్నగారు గుర్తుంచుకుంటేమంచిది. ఎన్నిధర్మసూత్రాలు వల్లించినా శ్రామిక జనం ఆనాడు తిరుగు బాట్లు చేయక మానలేదు. ఈనాడు గూడ చేయక మానరు. వాళ్ల అసంఘటితంగా వున్నచోట వాళ్ళను హత్యాకాండకు గురిచేస్తూ వాళ్ళు సంఘటితమయితే టెర్రరిజం అంటూ, ఎల్లకాలం పరిపాలించలేరు. ఈ విషయం పాలకవర్గాలు గుర్తుంచుకుంటే అది తమకే మంచిది.

కె. బాలగోపాల్

# తెలంగాణా విప్లవ పోరాటంలో మొలకెత్తిన ప్రజాకవిత్వం

"ఒక విలేఖరి"

జూలై 4 దొడ్డి కొమురయ్య సంస్మరణ దినం. తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటం ప్రారంభమైన రోజు. తెలంగాణ రైతాంగ పోరాటంపై 1946లో నైజాం పోలీసులు, రజాకార్లు కావించిన పాశవిక దాడుల గురించి సరేసరి. సెప్టెంబర్ 18, 1948 తర్వాత నవంబర్ నాటికి నెహ్రూ, పటేల్ భారత జాతీయ ప్రభుత్వం - ఇండియన్ యూనియన్‌లో హైదరాబాదు రాష్ట్ర విలీనం పేరుతో సాగించిన దమనకాండ గురించీ- సాంస్కృతిక రంగంలో దానిని ఎదుర్కొన్న క్రమం గురించీ ఈ వ్యాసం వివరిస్తుంది. దాదాపుగా అవే బూటకపు నినాదాలతో అదే నిర్బంధకాండ పునరావృతమైన ఈనాడు సాహిత్య సాంస్కృతిక రంగాల్లో మన కర్తవ్యాలను నిర్వచించుకోవడానికి ఈ వ్యాసాన్ని పునర్ముద్రిస్తున్నాం. — 'సాహితీమిత్రులు'

ఇండియన్ యూనియన్ ఆంధ్ర జిల్లాల్లో కూర్చుని నేడు తెలంగాణా మీద చాలామంది కథలూ గేయాలు రాస్తున్నారు. రాయకూడదని కాదు. తప్పక రాయాల్సిందే. కాని, తెలంగాణాలో అడుగైనా పెట్టకుండా, అక్కడి ప్రజలు ఎలా జీవిస్తున్నారో, ఎలా పోరాడుతున్నారో, ఎలాంటి విజ్ఞానాన్ని, వికాసాన్ని పొందుతున్నారో తెలుసుకోకుండా, కనీసం ఏ వూరు ఎక్కడుందో, ఏ ప్రాంతం ఏ తాలూకాలోదో అయినా ఎరగకుండా వూహాగానాలు చేస్తున్నారు. మన్నిస్తే రెండు ఉదాహరణలు చూపుతాను. ఎక్కడో తెలంగాణా లోపలగా, సరిహద్దుకు ఎటు చూసినా 80 మైళ్ళకు తక్కువ దూరంలో లేని దేవరుప్పుల అనే గ్రామం మన మునగాల సరిహద్దు దాటగానే కనిపించిందని ఒకాయన ఒక కథలో రాశాడు. ఇలాగే ఇంకో "ప్రత్యేక విలేఖరి"కి మధిర తాలూకాలో పాల్వంచ కనబడింది. పాల్వంచ ప్రత్యేక తాలూకాఅనీ, మధిర తాలూకాకు దానికీ ఎక్కడా సంబంధం లేదనీ ఆ ప్రత్యేక విలేఖరికి తెలియదు. తెలంగాణాతో అలాంటి "పరిచయం" గల వారి సాహిత్యాన్ని గురించి కాదు నేనిక్కడ ముచ్చటించేది. పోరాటంలో పాల్గొంటూ, నూతన చైతన్యాన్ని, విజ్ఞానాన్ని పొందుతూన్న "చదువురాని" సామాన్య ప్రజలలో నుంచి ఉద్భవించిన కవిత్వాన్ని గురించి మాత్రమే ప్రస్తావిస్తున్నాను. — వ్యాసకర్త

జోడునిమ్మ వాడ్తా — అదునావదెంతో
పుటుర్ పెర్సర్ వాడ్తు — అదునావదెంతో

పుత్తముక్కె పుట్టె – అదునావదెంతొ
పెర్సిముక్కె పెర్సికె – అదునావదెంతొ
పుయిత్తపుంగరపూసె – అదునావదెంతొ
అత్తకాయఅదికె – అదునావదెంతొ
పణ్ణ పండి పండికె – అదునావదెంతొ
వోని యక్కని .... – వోని కాకోని....

ఇది పాల్వంచ తాలూకాలో కోయలు పాడుకునే పాట. దీని అర్థం యిది:

తెచ్చే విత్తులు తెస్తూనే వున్నాం – అది నాదేనంటాడు
నాటే విత్తులు నాటుతూనే వున్నాం – అది నాదేనంటాడు
పుట్టేమొక్క పుడుతూనే వుంది – అది నాదేనంటాడు
పూసే పువ్వులు పూస్తూనే వున్నాయి – అది నాదేనంటాడు
పండే పళ్ళు పండుతూనే వున్నాయి – అది నాదేనంటాడు
వాడియక్కని.... – వాడియాలిని....

కోయల్లో నూటికి 99 మందికి చదువురాదు. నాగరికత లేదు. ఒంటి నిండా బట్ట కట్టుకోడం అయినా తెలియదు. చాల మంది ఇంకా ఆదిమ కమ్యూనిస్టు సమాజ పద్ధతుల్లోనే జీవిస్తారు. వారి అమాయకత్వాన్ని, అజ్ఞానాన్ని అవకాశంగా తీసుకొని "నాగరికులు", "విజ్ఞానవంతులు" అయిన డెల్టా ప్రాంతాలవారు ఈ కోయల్ని అనేక విధాల దోచుకుంటున్నారు. సోలెడు ఉప్పుపెట్టి కుంచెడు తేనె కాజేస్తారు. మణుగు చింతపండు తీసుకుని అణా డబ్బులు చేతిలో పడేస్తారు. పది రూపాయలు అప్పు పెట్టి పదియకరాల భూమిని - కష్టపడి అడవి నరకి సాగులోకి తెచ్చిన బంగారం వంటి భూమిని, లేదా పండించిన పంటను స్వాధీనం చేసుకుంటారు నూటికి రెండు వంచల రేటున వడ్డీలు కడతారు. ఈ విధంగా వందలాది ఎకరాలు, వేలకొలది రూపాయలు "సంపాదించి" పెద్ద పెద్ద భూస్వాములు, బంజరుదార్లు అయి కూర్చుంటారు. పాలేరును పెట్టుకుంటే వారిచ్చే పెద్ద జీతం సాలుకి 5 బస్తాలు, రోజంతా కష్టం చేయించుకుని వారిచ్చే కూలి బేడార్ధణా. ఇదీ పద్ధతి.

కాని ఎంత అమాయకులైనా, ఎంత అనాగరికులైనా కలకాలం అలాగే వుండరుకదా! క్రమక్రమంగా వారూ కళ్ళు తెరుస్తారు. తరతరాలనుంచి తాము పడుతూవున్న శ్రమకి ఫలితం శూన్యంగానే వుంటోంది ఏమిటా అని, ఒకప్పుడు

కాకపోతే మరొకప్పుడైనా ఆలోచన రాకమానదు. అదే చైతన్యానికి ఙంకురార్పణ. తమను దోచుకునే వారిపై ద్వేషం మెల్లి మెల్లిగా రగులుకుంటుంది.

పై పాట కొత్తగా మొలకెత్తే ఆ చైతన్యానికి, రగులుకునే ద్వేషాగ్నికి చక్కని ఉదాహరణ. తమకు నిత్యం జరిగే అన్యాయాన్ని మొదట సొగసుగా వర్ణించారు. చివరకు వచ్చేసరికి కోపం పట్టలేక నోటికి వచ్చిన రెండు బండ తిట్లు తిట్టి పాటను ముగించారు. ఇది వారికి ఒకరురాసి ఇచ్చింది కాదు. ప్రజలే కట్టుకున్నారు. పాడుకుంటున్నారు. అది వారి నిత్య జీవితానుభవంలో వారి హృదయాంతరాళం నుంచి వెలువడిన చైతన్య స్రవంతి! సామాన్య ప్రజానీకంలో నుంచి గొంతెత్తి గానం చేసిన కవితా కోకిల మధుర స్వరం.

అజ్ఞానాంధకారంనుంచి బైటపడుతున్న ఆ కోయ ప్రజలు మరికొన్ని అడుగులు వెలుగులోనికి నడిచారు. కమ్యూనిస్టు పార్టీ, ఆంధ్ర మహాసభల ప్రజా సైనిక దళాలు, కార్యకర్తలు పాల్వంచ తాలూకాలో ప్రవేశించిన తర్వాత, కోయలు 51 గ్రామాలను నైజాం పాలన నుండి విముక్తిగావించుకున్నారు. 30 గ్రామాలలో గ్రామ పంచాయితీ కమిటీలను నెలకొల్పుకున్నారు. తమ వద్ద నుండి దురాక్రమణ గావించబడిన భూమిలో 5వేల ఎకరాలు తిరిగి తమ స్వాధీనం చేసుకుని పంచుకున్నారు. అంతేకాదు, స్కూళ్ళను ఏర్పరచుకొని విద్య నేర్చుకోడానికి ఉపక్రమించారు. చంద్ర గ్రహణమంటే చంద్రుడ్ని ఎలుగుబంటి మింగేస్తుందనీ, మంత్రాలతో ప్రకృతిని సాధించవచ్చుననీ, కావాల్సిన కార్యాలు నెరవేర్చుకోవచ్చునని వుండే మూఢ నమ్మకాలను పారద్రోలుకుంటున్నారు. తమ శ్రమ విలువను తెలుసుకుంటున్నారు. తామూ బట్టకట్టి పదిమందిలోకి రావాలని కుతూహల పడుతున్నారు.

నైజాం నరకాసురుడి పరిపాలనకు, ఆ రాజ్యంలో జరిగే జాగీర్దార్ల, దేశముఖుల, పటేలు పట్వారీల దోపిడికి వ్యతిరేకంగా తెలంగాణా ప్రజలు గావించే విముక్తి పోరాటంలో "చదువురాని" ప్రజాసామాన్యంలో నుంచి ఉద్భవించిన కవిత్వానికి పైన చెప్పిన పాట ఒక్కటేకాదు ఉదాహరణ. ఇంకా చాలా వున్నాయి. అనేక రకాల గేయాలు ప్రజలు అల్లుకుంటున్నారు, పాడుకుంటున్నారు. ఆ పాటలన్నీ ఇక్కడ జాబితా ఇవ్వడం నా వుద్దేశం కాదు. రెండు మూడురకాల మచ్చుతునకలు మాత్రం చూపి, అవి ఏ పరిస్థితుల్లో ఎలా ఉద్భవించాయో తెల్పుతాను.

## శత్రువుపై ద్వేషం

ప్రజా శత్రువైన నైజాంపై ద్వేషాగ్ని వెడలగక్కే కవిత్వానికి చక్కని ఉదాహరణ యాదగిరి అనే ఆయన రచించిన గేయం.

"నైజాము సర్కారోడా ! రాచ్చసుల మించినోడా !
యమబాధ పెట్టితివి కొడకో ! నైజాము సర్కారోడా !"

అని మొదలు పెట్టాడు యాదగిరి. ఏమిటా యమబాధలు ? లోకానికంతకీ తెలుసు. ప్రజాఉద్యమాన్ని అణచడానికి, ప్రజల్ని లొంగదీయడానికి నైజాం చేయని నీచకార్య మంటూ లేదు. ప్రజలను కడుపు మాడ్చాలని పండిన పంటంతా దోచుకుపోయాడు. పోలీసు, మిలటరీ, రజాకార్లను పంపి వూళ్ళకు వూళ్ళు దోచి దహనం చేయించాడు. ఎందరో మానవతులను చెరిపించాడు. ఎన్ని చేసినా ప్రజలు లొంగలేదు. అదే యాద గిరి ఇలా వర్ణించాడు. మేము లొంగిరాము అని ప్రజానిశ్చయాన్ని విక్కచ్చిగా చెప్పాడు.

" పండీన పంటనంత తిండికైన వుంచకుండ తీసుకెళ్ళినావు
దున్నాను భూమిలేక, పండాను ఇల్లులేక, పరదేశమైతిమి
కొడకో, నైజాము సర్కాడోడా,
నీ పోలీసు మిలటరి జూసి మేము లొంగివస్తమని
ఒక ఆశపడ్డివి కొడకో నైజాము సర్కారోడ,
పోలీసు మిల్టరిగాని, లాఠీదెబ్బలు గాని
తుపాకి కాల్పులఁగాని, మిషీను గన్నులుగాని
తుపాకి బాంబులుగాని, నీవెన్ని తెచ్చినగాని
మేము లొంగి రాము కొడకో నైజాము సర్కారోడా !"

ఎన్నిచేసినా లొంగిరామనే దొకఉకాదు. మా ప్రజాఉద్యమం ఏదో ఒక ప్రాంతానికి చెందినది కాదు. నీ పీఠమైన హైద్రాబాద్ చుట్టూ, తెలంగాణా అంతటా వ్యాపించి వుంది, జాగ్రత్త! నీకు గోరీ కట్టందే మేము నిద్రపోము సుమా అని హెచ్చరించాడు.

"చుట్టూను సూర్యపేట, మధ్యాన నల్లగొండ
తరువాత హైద్రాబాద్, అవతాల గోలకొండ

గొలకొండ ఖిల్లక్రింద, నీ గోరికట్తము కొడకో నైజాము
సర్కారోడ."

ఆ గోరిని కట్టడంలో కూడా, ఏ గోల్కొండ నవాబుగా వుండి మన తెలుగుదేశాన్ని నైజాం కబళించాడో ఆ గోల్కొండఖిల్లా క్రిందనే కడ్తాం, తెలుసా, అని హుంకరించాడు యాదగిరి.

యాదగిరికి చదువు ఏమీ రాదు. కడు పేద వ్యవసాయకూలీ కుటుంబంలో పుట్టి పెరిగాడు. అతనిది విప్లవ ప్రజాఉద్యమానికి పట్టుగొమ్మ అయిన నల్లగొండ జిల్లాలోని సూర్యాపేట తాలూకా. తెలంగాణా విముక్తి పోరాటంలో తనలాంటివాళ్ళ పాత్ర ఏమిటో తెలుసుకున్నాడు. గెరిల్లాదళంలో చేరి ఆయుధాన్ని చేతబట్టాడు, ప్రాణం పోయేవరకు ఆయుధం విడిచిపెట్టలేదు. ముష్కరులు నైజాం మిలిటరీ యాదగిరిని పట్టుకొని కత్తులతో నరికి చిత్రవధ చేసి చంపారు. అతను చనిపోయింది. ఎక్కడో కాదు. మన మునగాల సరిహద్దుల్లో తిరుమలగిరి అనేచోట. అలాంటి మేలుజాతి తెలుగురత్నాన్ని, ప్రజాసైనికుడ్ని, కవిని, పొట్టనబెట్టుకున్న "పుణ్యం"లో మన భారత యూనియన్ పోలీసులు కూడా కొంతభాగం పంచుకోకుండా వదిలి పెట్టలేదు. ప్రాణరక్షణకు మునగాల పరగణాలోకి పారివస్తున్న యాదగిరి దళాన్ని ఇటునుంచి వీరు తరిమారు. అటునుంచి నైజాం మిలిటరీ వెంటాడింది, విధిలేక పొద చాటున దాగివున్న యాదగిరి నైజాం రాక్షసుల చేజిక్కాడు.

దాదాపు రెండు సంవత్సరాలు నల్లగొండ జిల్లా నైజాం దురంతాలకు చలించకుండా నిలిచింది (ఇప్పటికీ అంతే). నైజాం ఆటలు సాగలేదు. ప్రజలు ఎదురు దెబ్బలు కొట్టే స్థాయికి ఉద్యమం పురోగమిస్తోంది. వందలకొలది గ్రామాలు విముక్తి గావించబడుతున్నాయి. పంచాయితీ కమిటీలను ఏర్పరుచుకుంటున్నాయి. దేశముఖులచే దురాక్రమణ కావించబడిన వేలకొలది ఎకరాల భూమి తిరిగి రైతులకు పంచడం ప్రారంభించారు. ఆ దశలో యాదగిరి యీ గేయాన్ని తన విప్లవకంఠాన్నెత్తి గానం చేశాడు. 'అంతిమ విజయం మాదే నైజాంకు గోరీ కట్టి తీర్తాం' అని ధీమాతో పలికాడు. అతని గేయం తెలంగాణా అంతటా మారుమ్రోగింది. ప్రజలంతా అందుకున్నారు.

చమత్కార కవిత్వం :

నైజాం తొత్తులైన దేశముఖుల ఎడల, వారి క్రింద తొత్తులైన కొందరు గ్రామ పెత్తందార్ల ఎడల ప్రజలకున్న ద్వేషం, యాదగిరి రచించిన వాటిలాంటి పాటలలోనే కాదు మనకు కనబడేది - అట్టి ప్రజా శత్రువుల్ని హేళనచేస్తూ రచించిన చమత్కార గేయాలు కూడా వున్నాయి.

కలియుగ రావణాసురుడని పేరుగాంచిన విసునూరుదేశముఖు పేరు వినని తెలుగువారుండరు. తెలంగాణా ప్రజాఉద్యమం మొదట తలఎత్తింది వాని గ్రామాల తోనే. రాక్షసుడైన విసునూరు రామచంద్రారెడ్డి తల్లి ఒక బ్రహ్మరాక్షసి. ఆమెను ఎవరూ "అమ్మా!" అని పిలవకూడదు. పిలిస్తే "నీ తండ్రికి నేను భార్యనా?" అని గాండ్రింపుతుంది. పోనీ "దొరసానీ" అంటే "అదుగో నన్ను సాని అంటావా?" అని విరుచుక పడుతుంది. ఆమెను అందరూ "దొరా!" అనే పిలవాలిట! కడవెండి అనే గ్రామంలో తన గడీ(కోట)లో కూర్చుని చుట్టుప్రక్కల వూళ్ళన్నీ ఏలుతూ వుంటుంది ఆమె. ఆ గ్రామానికి మూడు నాలుగు మైళ్ళ దూరంలో దేవరుప్పుల అనే వూరుంది. ఆ వూళ్ళో అబ్బసలీ, బేతు కృష్ణారెడ్డి అనే అనే ఇరువురు ప్రజాశత్రువు లున్నారు. వీరిద్దరూ ఆ బ్రహ్మరాక్షసికి కరటక దమనకుల్లాంటి మంత్రులు. ఈ ముగ్గురిమీదా ఒక చదువురాని బీదరైతు చమత్కారంగా కట్టిన పాట గురించే నేనిక్కడ ముచ్చటించేది.

దాని ఇతివృత్తం ఇది, కడవెండి, దేవరుప్పుల, ధర్మాపురం మొదలైన గ్రామాలలో ప్రజావెల్లువ లేచింది. విసునూరు రామచంద్రారెడ్డి సహాపై యీ దుష్టత్రయం కడవెండిలో కొమరయ్యను కాల్చి చంపారు (1946). నైజాం పోలీసులచే దాడులు చేయించి మోహన్‌రెడ్డి అనే మరో ప్రజానాయకుడ్ని జైలులో పెట్టించారు. ఎన్ని చేసినా ఉద్యమం చల్లారలేదు. అందరికంటే ముందు దేవరుప్పుల లోని యీ యిరువురు కరటక దమనకులకు దడ పుట్టింది. బ్రహ్మరాక్షసి వద్దకు పోయి రక్షించమని కాళ్ళా వేళ్ళా పడతారు.

"అమ్మగాను అమ్మ దొరసానీ
మమ్ము రచ్చించమ్మ దొరసానీ
దేవరుప్పుల లోన ఇక బతకలేము

బతికుండగ మమ్ము పాతిపెడతారు
*సంగమ్ము పిచ్చేమొ తలకెక్కినాది
లొంగి వచ్చేటట్టు వారు లేరమ్మ
పై పెచ్చు పాణాలు తీస్తమంటారు
.... .... .... .... .... ....
.... .... .... .... .... .... అని మొరపెట్టుకుంటారు.

దీనికి బ్రహ్మరాక్షసి ఇలా అని అభయం యిస్తుంది:

"అయ్యగాను అయ్య కిష్టయ్య!
అబ్బసాలీ సాయెబయ్య!
నా బొందెలో ప్రాణముంటేను
మిమ్ము సంగముపాలు జేస్తానా?
చెట్టంత నా కొడుకు చెంతనున్నాడు
వినునూరు దొరలంటె ఎనుమంటివోరు?
సర్కారు పోలీసు సాయమున్నారు
ఆపైన నైజాము మిల్టరున్నాది
.... .... .... .... .... ...."

అని ఏమేమో ప్రగల్భాలు కొడుతుంది. ఎంత చెప్పినా వీరికి గుండెదిటవు చేకూరలేదు. అబ్బసలీ వూరు విడిచి పారిపోతాడు. కృష్ణారెడ్డి ప్రజల వద్దకువచ్చి కాళ్ళమీదపడి క్షమాభిక్ష వేడుకుంటాడు.

"తప్పుచేశానయ్య బుద్ధి వచ్చింది
అబ్బసాలీ దరికి నేనింకబోను
కులముతోనే కలిసి కూడుచుంటా
కడవెండి గడిలో అడుగుబెట్టాను
మీరేం చేసినా నేనొప్పుకుంటా
.... .... .... .... .... ...."

* సంగం అంటే ఆంధ్రమహాసభ, ప్రజలు సంగం అని వ్యవహరిస్తారు.

ఈ విధంగా అంటూ చమత్కారంగా ఒక కథలాగ నడుపుతాడు కవి. కాని ఆ చమత్కార గేయాలు పాడుకునే ప్రజాహృదయాలలో, వాటి వెనుక ఎంత ద్వేషం రగులుతూవుందో ఒక్క చర్య చూస్తే చాలు బోధపడుతుంది. నైజాంపై యూనియన్ సైన్యాలు "యుద్ధానికి" దిగారని తెలియగానే నల్లగొండజిల్లా ప్రజలంతా ఒక్కుమ్మడిగా లేచారు. విసునూరు గడీ లాంటి గడీలు దాదాపు 15 వరకూ నేలమట్టం చేశారు.

రాజకీయ విజ్ఞానము :

తమ సంస్థాన విప్లవోద్యమం ఏ స్వరూపం తీసుకుంటుందో, దానియెడల యూనియన్ ప్రభుత్వము నాయకులు ఎలాంటి వైఖరి అవలంబిస్తున్నారో తెలంగాణా ప్రజలు గమనిస్తూనే వున్నారు. అన్ని పార్టీల రాజకీయాలను ఓ కంటితో కనిపెడు తూనే వున్నారు. ఎవరి రంగు ఏమిటో వారు గ్రహిస్తున్నారు. తమ కర్తవ్యం ఏమిటో కూడ గుర్తిస్తున్నారు. దానికి యీ మధ్య జరిగిన "పోలీసుచర్య" తతంగానికి పూర్వం రచించబడిన మరో గేయం ఉదహరిస్తాను. దానిని సూర్యాపేట తాలూకా ప్రజాసైనికదళంలో పనిచేసే ఒక బీద రైతుబిడ్డ రచించాడు.

నైజాంలో యూనియన్ రాజీబేరాలను గురించి యిలా అన్నాడు:

"వినూ వినూ రైతన్న! వినరా కూలన్న॥ ॥వి॥
అంగ్రేజుతో వున్న కాంగ్రేజు సరకారు
స్వాతంత్ర్యమన్నారు, సోషలిజమన్నారు
ప్రజల రాబందల్లె పీక్కుతిను నైజాము
కూలిపోతున్నట్టి జాగీరు పద్ధతిని
తుప్పుపట్టిన పాత దోపిడీకత్తినీ
రాజీకాంగ్రెసోల్లు నేడు రక్షించబూనారు॥ వి॥

యూనియన్ ప్రజలకి వచ్చిన స్వాతంత్ర్యం ఎటువంటిదో ఇలా చర్చిస్తున్నాడు:

"నేతి బీరకాయ స్వాతంత్ర్యమదిరా
మేడిపండురబాబు మేకవన్నె మొకము
దోపిడీపీడవనూ కాపాడేదదిరా
పాపిపాలన నిలువు బయలుదేరిందీ

అన్నమడిగే ప్రజల అణచసాగిందీ॥ వి॥

.... .... .... .... .... .... ....

ఇక తమ తెలంగాణా పోరాటాన్ని గురించి యిలా చెబుతున్నాడు.

"దేశముఖులు దొరలు రజకార్లనూ గలిపి
తెలుగోళ్ళు మనుమంత నెలలాగ పోరాడి
ధన మాన ప్రాణాలు మనము బలి పెట్టాము
మూడువేలా వూళ్ళు విముక్తి జేశాము
లక్షలా యెకరాల సుక్షేత్రమౌ భూమి
దున్నేవాడికే దాని పంచుతున్నాము
పటేలు సైన్యాలు పంప ప్లాను వేస్తున్నాడు.
నైజాంకు యుద్ధంపు బెదురు పెడ్తున్నారు
వీరంత జతకలసి పాలించుతారు" ॥వి॥

ఆ విధంగా చివరకు జరగబోయేది ఏమిటో కూడ ముందే చెప్పేశాడు. కాని తాము లొంగము. న్యాయం తమ పక్షాన వుంది. విజయం సాధించి తీరుతాం అని ఉద్ఘాటిస్తాడు. ఆత్మవిశ్వాసాన్ని ప్రకటిస్తాడు:

"పంచుకున్న భూమి పరులకిస్తామా?
తెలుగోడు ఒకడున్న ఖలులకిస్తామా?
నలభై కోట్ల ప్రజల బలము మనకుంది
న్యాయధాటీముందు నైజాము హజమెంత?
....సైన్యాలెంత? నుసినుసిగానా?
శత్రుశేషము లేక సఫా సఫా జేస్తాము
సుఖస్వర్గరాజ్యాన్ని స్థాపించుతాము
విజయశంఖము మనము పూరించుతాము"

తెలంగాణా విప్లవ పోరాటంలో కొత్తగా చిగురించిన ప్రజాచైతన్య వసంతంలో "ఆకులందున అణిగిమణిగి, కవితకోకిల" పలుకుతూన్న పలుకులు కొన్ని విన్నాం. మహాకవి ముగ్దుం చెప్పినట్లు:

"భారతభూమికి జ్యోతి - తెలంగాణా!
నవభారత భూమికి నేత - తెలంగాణా!
పిలుస్తున్నదది వేరొక బాటకు - నేడు తెలంగాణా!
విప్లవసందేశాన్నందించే - వీర తెలంగాణా!!!"

ఆ "వేరొకబాట" ఏమిటో కూడా మనకు కనబడుతూనే వుంది. నాజీలను మించిన నైజాం నవాబులాంటి రాక్షసప్యూడల్ పరిపాలన అంతం కావాలి. నిత్యమూ రైతుకూలీ జనసామాన్యాన్ని మూలుగులు పీల్చే దేశముఖు, జాగీర్దారీ విధానం నాశనం కావాలి. దాని స్థానే ప్రజలచే ఎన్నుకొనబడే, ప్రజావిశ్వాసాన్ని చూరగొన్న నూతన ప్రజాస్వామ్య విధానం నెలకొల్పబడాలి. ఒకరి శ్రమనింకోరు దోచుకోని సమాజం కావాలి. ప్రజలందరూ విజ్ఞాన వికాసాలను పొందాలి.

తెలంగాణా ప్రజలు ఆ మార్గాన్నే అవలంబించారు. 60 సంవత్సరాలు "తపస్సు" చేసి మన జాతీయోద్యమం సాధించలేని విజయాన్ని, వారు రెండేళ్ళలో సాధించారు.

కాని, నేడు ఆ వీర తెలంగాణా పట్ల మన భారత జాతీయ ప్రభుత్వం అవలంబిస్తూన్న వైఖరి ఏమిటి? ప్రపంచానికి కమ్యూనిస్టు 'పెనుభూతాన్ని' చూపించి, తెలంగాణాలో మొలకెత్తిన నూతన చైతన్యాన్ని, విజ్ఞానాన్ని, నాశనం చేయబూనుకుంది. ఆ నైజాం నవాబునే, ఆ దేశముఖులనే, ఆ జాగీర్దార్లనే, ఆ రాక్షస పరిపాలననే, ఆ దోపిడినే కాపాడ నమకట్టింది. ప్రజల నెత్తిమీద చిరస్థాయిగా వుంచడానికి ప్రయత్నిస్తోంది. మొన్నటి వరకూ రజాకార్లు, నైజాం మిలిటరీ, ప్రజలపై దాడులు జరిపి దుర్మార్గాలు చేసి, గ్రామాలను నాశనం చేస్తే, నేడు మన స్టేటు కాంగ్రెసు అదే రాక్షసకృత్యాలను, బీభత్సాన్ని విచ్చలవిడిగా సాగిస్తున్నారు. ఇంకా పెద్ద ఎత్తున "మిలిటరీ చర్య"లకు మెషిన్‌గన్‌లు, టాంకులతో సహా సైనిక సమీకరణలు జరుగుతున్నాయి.

ఇంతకంటే భారత విజ్ఞానానికి అవమానం ఇంకోటి వుండదు. ఈ మారణ హోమం సాగితే అక్కడ నాశనమయ్యేది కమ్యూనిజం కాదు. వందలయేండ్ల నిద్ర నుండి మేల్కొని నూతన వికాసాన్ని పొందుతున్న ఒక జాతి. ఒక విజ్ఞానం. అది కూడా ఎవరిదో కాదు. మనదే. మన ఆంధ్రజాతి, మన నవ్యాంధ్ర విజ్ఞానం, విశాలాంధ్ర ప్రజారాజ్యానికి నిర్మింపబడుతున్న పునాది నాశనమవుతుంది. ఈ సత్యాన్ని గుర్తించిననాడు మన కర్తవ్యం సుస్పష్టమే. అభ్యుదయ కాముకులైన ఆంధ్రకవులు, రచయితలు, చిత్రకారులు, చరిత్రకారులు నిర్భయంగా ముందుకు రావాలి. యీ విజ్ఞానవినాశ కార్యక్రమాన్ని ఏక కంఠంతో ఖండించాలి. ఆ విధానానికి స్వస్తి చెప్పేవరకు ఆందోళన సాగించాలి. లేకపోతే ఆ మహాపాతకంలో మనమూ పాలు పంచుకున్న వారమవుతాం.

సౌజన్యం : [విశాలాంధ్ర, మాసపత్రిక, నవంబర్ 1948]

హైదరాబాద్
తేది 17. 7. 85

గౌరవనీయ ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగారికి,

అయ్యా !

ప్రజల పరిస్థితులను ప్రభుత్వం మెరుగుపరచాలి. అందుకు వారి మౌలిక సమస్యలను పరిష్కరించాలి. మన రాష్ట్రంలో ఎన్ని ప్రభుత్వాలు మారినా ప్రజల జీవితాల్లో చెప్పుకోదగ్గ మార్పు లేదు. ప్రజల తిండి, బట్ట, ఇల్లుకు సంబంధించిన సమస్యలను మీరు శాంతిభద్రతల సమస్యగా చూస్తు న్నారు. ఇబ్బంది పడుతున్న ప్రజానీకం ఆందోళనకు దిగినప్పుడల్లా వారు తమ నిర్బంధానికి గురవుతున్నారు.

మీ పార్టీ అధికారంలోకి వచ్చిన తర్వాత కూడ ఈ పరిస్థితిలో మార్పులేదు. అనేక మంది అమాయకులు పోలీసు కాల్పుల్లో లాకప్పుల్లో దుర్మరణం పాలవుతున్నారు.

ఇది చాలదన్నట్లు కొత్తగా మీరు రాష్ట్రంలో ప్రవేశపెట్టబోతున్న టెర్రరిస్టు చట్టం ప్రజాస్వామిక హక్కులను, భావప్రకటనా స్వేచ్ఛనూ హరిస్తుందని మేం భావిస్తున్నాం. ఈ చట్టాన్ని ప్రవేశపెట్టే ఆలోచనను మానుకోవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం.

ఎన్‌కౌంటర్ హత్యలూ, లాకప్ హత్యలూ ఆపెయ్యమనీ, టెర్ర రిస్టు చట్టం మానెయ్యమనీ కోరుతున్నాం.

ఈ సందర్భంలో నా విజ్ఞప్తిని పురస్కరించుకొని రాష్ట్రవ్యాప్తంగా 75 మంది రచయితలు సంతకం చేసిన ప్రకటన కాపీని దీనితో జత పరుస్తున్నాను.

ఇట్లు
కాళోజీ నారాయణరావు

హైదరాబాద్
17. 7. 1985

'అతడు - ఆమె - జాతీయోద్యమం' పేజీ నంబర్లు పొరపాటు పడ్డాయి. 41 నుండి 56 వరకు వున్న ఆ పేజీలను 40 నుండి 64గా చదువుకోవాలి.

అక్కలారా మీరు ఉయ్యాలో
చక్కంగ ఆడండి ,,
అడుగులో అడుగేసి ,,
నుడుగులు బల్కండి ,,
చిన్నారి చెల్లెళ్ళు ,,
చివరికి బట్టండి ,,
గాజులా చప్పుళ్ళు ,,
ఘల్లుఘల్లున మోగ ,,
మెట్టెల చప్పుళ్ళు ,,
ముచ్చెట్లు చెప్పంగ ,,
పాటిరిగి పోకుండ ,,
చప్పట్లు కొట్టండి ,,
ఆటిరిగి పోకుండా ,,
అడుగులు వేయండి ,,
బతుకు పాటినిపిస్త ,,
వెతల పాటినిపిస్త ,,
రామరావు ఏలె ,,
ఈ రామరాజ్యంలో ,,
పేదోళ్ళ బతుకులు ,,
అధ్వాన్న మైపోయె ,,
మాన రక్షణ లేదు ,,
ప్రాణ రక్షణ లేదు ,,
రామ రాజ్యమని ,,
రంకెలా వేసింద్రు ,,
ఈ రామరాజ్యంలో ,,
రామరావు బంట్ల ,,
దొరల దుర్మార్గాలకు ,,
ఢోక లేదోయమ్మ ,,
ఒంగోలు జిల్లాలో ,,
పర్చూరు తాలూక ,,
చీలరాకప్రక్కనే ,,
ఊరొక్కటుందమ్మ ,,

## కారంచేడు మారణహోమం

పేరు కారంచేడు ఉయ్యాలో
ఊరు పొగరుబోతు ,,
కారంచేడంటేను ,,
కలిగినోళ్ళా పూరు ,,
కొవ్వెక్కి బలిసిన ,,
కామందులా ఊరు ,,
బంగారు పండేటి ,,
వందల ఎకరాలు ,,
ధనరాసులా ఉన్న ,,
భూస్వాములున్నారు ,,
కంపెనీలు గల్ల ,,
కామందులున్నారు ,,
దొంగ బంగారంతో ,,
ధనవంతులా అయ్యి ,,
కొవ్వెక్కి మదమెక్కి ,,
కండకావరముతో ,,
ఎదురు చెప్పినోళ్ళ ,,
ఎగబడి కొడతారు ,,
ఆ ఆసాములల్లోన ,,
ముఖ్యమై నోళ్ళంత ,,
ముఖ్యమై నోళ్ళంత ,,
ముఖ్యమంత్రికి బంధువులు ,,
పేదసాదలాను ,,
పేల్చుకొని తింటుంద్రు ,,
కాల్చుకొని తింటుంద్రు ,,
కారంచేడులోన ,,
కలదు ఒక్క పల్లె ,,
పల్లెంటే పల్లె కాదు ,,
వాళ్ళ గుండెల్లో బల్లెము ,,
కష్టజీవులు వాళ్ళు ,,
కట్టుబాటున్నోళ్ళు ,,
ఒక్కమాట మీద ,,

కట్టుబడి వుంటారు ఉయ్యాలో
మాటపడని యట్టి ”
మాదిగన్నలు వాళ్ళు ”
తిట్టినా కొట్టినా ”
తిరగబడి తీర్తారు ”
పల్లె గట్టిగ వుంటె ”
తమ ఆట కట్టని ”
భూస్వాముల గుండెల్లో ”
బల్లెమైనా పల్లెను ”
దెబ్బదీయాలని ”
అదునుకై జూస్తుంద్రు ”
అదునుకై జూస్తున్న ”
ఆసాము లందరికి ”
ఒకనాటి రోజునా ”
అదును దొరికిందమ్మ ”
పల్లె పల్లెంతటికి ”
మంచినీళ్ళ చెరువు ”
మాదిగ పల్లెకు ”
చెరువొక్కటుందమ్మా ”
ఆ చెరువు గట్టుమీద ”
గొడవ లేపాలని ”
ఊరిలో భూస్వామి ”
భూస్వామి బిడ్డడు ”
పోతిన శ్రీనసే ”
భూస్వామి బిడ్డడు ”
అహంకారముతోటి ”
ఆ చెర్వు గట్టూమీదే ”
కడిగినా నీళ్ళన్ని ”
చెరువులో పడేటట్టు ”
దున్న పోతునువాడు ”
కడుగుతున్నాడమ్మ ”
కత్తి చంద్రన్ననే ”

పల్లెలో కుర్రాడు ఉయ్యాలో
దున్న నెక్కడ నువ్వు ”
కడిగేది అంటేనే ”
మాదిగ నాకొడక ”
ఎదురు చెబుతావాని ”
చర్నకోలాతో ”
చంద్రన్ననూ తన్నె ”
చెరువులో పడవేసి ”
చిత్తుగా తన్నిండు ”
అంతలో నేనమ్మ ”
నీళ్ళకని వచ్చిన ”
మున్నంగి సువార్త ”
యిది యంతా జూసింది ”
అయ్యయ్యో ఇది ఏమి ”
అన్యాయ మనుకొంది ”
తప్పు జేసిందిగాక ”
తంతున్న వేంవంటే ”
మాదిగ లంజంటు ”
బండబూతులు తిట్టి ”
పొత్తి కడుపు మీద ”
కాలెత్తి తన్నిండు ”
కోపమొచ్చిన అక్క ”
కోడెనాగై లేచె ”
చేతిలో బిందెతో ”
చెంపమీద పొడిచె ”
ఇరుగుపొరుగు వాళ్ళు ”
ఇది అంత చూసింద్రు ”
సర్దుబాటు చేసి ”
సాగనంపింద్రమ్మ ”
ఆ రోజు రాత్రికే ”
అవూరి ఆసాములు ”
అదును దొరికిందని ”

ఆనందపడ్డారు ఉయ్యాలో
ఏ విధంగానైనా "
మాదిగ పల్లెను "
మట్టి చెయ్యాలని "
గట్టి పట్టుపట్టి "
రాయినేడుగాడి "
బ్రాంది షాపులోన "
మందు మస్తుగగొట్టి "
విందు జేసుకుంద్రు "
కులం పేరుజెప్పి "
కులపిచ్చిగాళ్ళను "
కమ్మ పుటుకా పుడితె "
కదలిరమ్మనియంటు "
చుట్టుప్రక్కల నుంచి "
పట్టుకొచ్చింద్రమ్మ "
పెత్తందారులు అంతా "
ప్లాను గీసుకొని "
మరునాటి రోజుకే "
మాదిగపల్లెను "
బూడిద చేయాలను "
ప్లాను గీసుకుంద్రు "
ఆ రోజు రాత్రికే "
ఆయుధా లన్నిటిని "
సిద్ధం జేసుకొని "
పొద్దున్నే కదిలారు "
ఇంత జరుగుద్దాని "
ఎరుగనట్టి జనం "
హఠాము గంటయిని "
అదరాబాదరా "
పల్లెలోని జనం "
ప్రొద్దున్నే నిద్రలేచు "
ఎవరి పనులకు వాళ్ళు "

ఎల్లిపోయిన్రమ్మ ఉయ్యాలో
అనుకొన్న మాదిరిగ "
ఆసాములందరు "
ఆయుధా లందుకొని "
కత్తులు బరిసెలతో "
క్రూరజంతువుల్లాగ "
దుర్మార్గులందరూ "
దండుగా గలిసింద్రు "
టీ త్రాగటానికని "
టీ కొట్టుకొచ్చిన "
నాగేశ్వర్రావును "
వాల్లు చూసింద్రమ్మ "
సగం టీ తాగిన "
నాగేశ్వరరావును "
మెడచుట్టు టవలేసి, "
బయటకు లాకొచ్చిరు "
చెప్పుతోటి వాల్లు "
చెంపమీద కొట్టి "
కాళ్ళతో చేతులతో "
కుమలపొడిచింద్రమ్మ "
తన్నుతూ గుద్దుతూ "
అన్నను వాళ్లంతా "
స్టేటు బ్యాంకు దాక "
ఈడ్చుకొచ్చినారు "
తాల్లు తీసుకరాంద్ర "
ఈన్నికట్టి పడేద్దామంటూ "
ఆసాములందరు "
అటుయిటు చూసింద్రు "
అంతలోనేనమ్మ "
అక్కడున్నోళ్ళకు "
మండప రాఘయ్య "
యింటిలోనేనమ్మ "

మున్నంగి అంకయ్య ఉయ్యాలో
ఉన్నాడని తెలిసి "
పడిపోయి నన్నను "
అక్కడే వదిలేసి "
రాధయ్య యింటికి "
పరుగు తీసింద్రమ్మ "
యింటిలోన వున్న "
మున్నంగి అంకయ్యను "
బయటికి పంపమని "
బండబూతులు తిట్టి "
ఆ యింటి ఆసామి "
బైటికి గెంటిండు "
బైటికి వచ్చిన "
మున్నంగి అంకయ్యను "
పడగొట్టి వాళ్ళంత "
పల్లెమీది కొచ్చిరు "
కత్తులు బరిసెలతో "
గండ్రగొడ్డళ్లతో "
ఉప్పెనోలే వాల్లు "
ఉరికొచ్చినారమ్మ "
ఇది జూసి అన్నలు "
అందరొక్కపైరి "
అన్నలను జూసిన "
ఆసాములందరికి "
వెన్నుపూసలోన "
వొనుకు పుట్టిందమ్మ "
ఎదురుపోతేనేమొ "
ఎగిరిపోతామని "
ఒక్కడుగు వెనకేసి "
అక్కడే ఆగింద్రు "
ఆయుధాలతోటి "
పల్లెల్లో అన్నలు "

ఒక్కపై వుండేను ఉయ్యాలో
ఎదురించ లేమ్మని "
కుట్ర జేసినారు "
మట్టి జెయ్యాలని "
మనలో మనకెందుకు "
తగవులాటలాని "
రాజీ పడదామని "
నలుగురు ఆసాములు "
అన్నల చేతిలో "
ఆయుధా లన్నిటిని "
క్రింద పెట్టించెమ్మ "
కనుసైగ జేసింద్రు "
సైగ నందుకోని "
ఆసాములందరూ "
లేడిపిల్లమీద "
పులిదుంకినట్లుగా "
పందల వేలల్లో "
గండ్రగొడ్లళ్ళతో "
కత్తులు గొడ్డళ్ళతో "
సరివిబాదులతోటి "
ఈలలు అరుపులతో "
పల్లెంత ఒక్కసారి "
" " "
చుట్టు ముట్టింద్రయ్య "
పైరు బండ్లన్నిటిని "
పైర్లు కోసింద్రమ్మ "
సైకిల్ల నన్నిటిని "
చితకకొట్టేసింద్రు "
మంచాల నన్నిటిని "
మధ్యకు నరికింద్రు "
గల్లిగల్లీ దిరిగి "
యిల్లన్ని గాలిచ్చి "

అన్నల్ని అక్కల్ని ఉయ్యాలో
తల్లుల్ని చెల్లెల్ని ,,
ముసలోల్ల ముతకోల్ల ,,
పిల్లల్ని పెద్దల్ని ,,
కత్తులా బరిశెల్తో ,,
నెత్తుర్లో ముంచింద్రు ,,
పల్లెల్లో అన్నలు ,,
ప్రాణభీతితోటి ,,
చెదిరిపోయినవాళ్ళు ,,
పరుగుదీసింద్రమ్మ ,,
తండ్రి ముందేనమ్మ ,,
కొడుకుల్ని కొడుతున్న ,,
బైటికి వస్తేను ,,
పొడిచి చంపుతారని ,,
కళ్ళముందే కొడుకును ,,
నరుకుతుంటేనమ్మ ,,
కడుపులోని శోకము ,,
గొంతులో ఆపుకొని ,,
గట్టిగా ఏడిస్తే ,,
గుర్తుపడ్తారని ,,
మచ్చుమీదా తండ్రులు ,,
ముడ్సుకు పడుకున్నరు ,,
పనికెళ్ళటానికి ,,
బయలెల్లుదామని ,,
కంచము ముందమ్మ ,,
కూచున్న వాళ్ళను ,,
నోటిదాకా ముద్దను ,,
పెట్టుకునోళ్ళను ,,
బైటికీడ్చుకొచ్చి ,,
బరిశెల్తో పొడిసింద్రు ,,
కావలసినవాళ్ళు ,,
కనపడలేదని ,,

వాళ్ళ భార్య అమ్మ ఉయ్యాలో
కంటపడితే నమ్మ ,,
ఆడాటి కోకలు ,,
ఇప్పితేరా మనము ,,
ఆ లంజకొడుకులే ,,
ఉరికొస్తరనుకుంటూ ,,
కనికరము లేకుండా ,,
కటిక కొడుకులు ,,
అక్కలా చెల్లెళ్ళ ,,
కోకలిప్పిరమ్మ ,,
ప్రాణ భీతితోటి ,,
ఇళ్ళల్లోనా దూరి ,,
మచ్చుమీద కెక్కి ,,
నక్కి కూచ్చునోళ్ళ ,,
బరిశెలతోటమ్మ ,,
పొడిచి చూశింద్రమ్మ ,,
ఇదె యంత జూసిందు ,,
దుడ్డు వందనమన్న ,,
చూస్తు ఊరుకుంటే ,,
పల్లె పల్లెంతాను ,,
,  ,, ,,
నశింపై పోతుందను ,,
పోలీసు రిపోర్టు ,,
యిచ్చి రావటానికి ,,
కన్నతల్లి దగ్గర ,,
పది రూపాయల్దిస్కొని ,,
దొడ్డి దారెంటమ్మ ,,
బయలుదేరింటమ్మ ,,
బయలెల్లినా అన్నను ,,
నై పోగులాకాడ ,,
అడ్డగించి వాళ్ళను ,,

గొడ్డల్లతో నరికి ఉయ్యాలో
,, ,, ,,
బరిశెల్తో పొడిశింద్రు ,,
గెరిక నట్టునుంచి ,,
చర్చికాంపౌండ్ దాక ,,
తూలుకుంటూ అన్న ,,
పడిపోయినాడమ్మ ,,
పడిపోయినా అన్నను ,,
చచ్చాడా లేదని ,,
పదిమంది కొడుకులు ,,
పై కెక్కి తొక్కారు ,,
అది జూసి ఆ తల్లి ,,
తల్లడిల్లి పోయి ,,
గుండెలు పగిలేలా ,,
గోడుగోడున ఏడ్చి ,,
కొనవూపిరితో ఉన్న ,,
కొడుకు కాడికొచ్చి ,,
కుమిలి కుమిలి ఏడ్చి ,,
కొడుకుమీద పడ్డదు ,,
అంతలో అక్కడికి ,,
పోలీసు వ్యానొచ్చి ,,
వ్యానుజూసి తల్లి ,,
పరుగెత్తుకుంటెలి ,,
అయ్యయ్యో నా కొడుకు ,,
కొన ఊపిరితో ఉండు ,,
కొడుకును ఆస్పత్రికు ,,
తీసుకెళ్ళామని ,,
కాళ్ళామీదపడి ,,
ఏడ్చి మొత్తుకుంది ,,
కనికరము లేనట్టి ,,
కటిక పోలీసులు ,,
బాబుగారింటికి ,,

ముందుగా వెళ్ళాలను ఉయ్యాలో
వెళ్ళి వచ్చినాకే ,,
మళ్ళీ చూస్తామని ,,
బర్రున జీపులో ,,
వెళ్ళిపోయింద్రమ్మ ,,
తల్లి కళ్ళముందె ,,
కొడుకు పానమొదిలె ,,
పల్లెంతటిని వాళ్ళు ,,
ధ్వంసము చేశాక ,,
పరిగెత్తినోళ్ళని ,,
పట్టుకొని వాళ్ళని ,,
మట్టిలో కలపాలను ,,
మోటారు సైకిల్లు ,,
లారీలు ట్రాక్టర్లు ,,
ఏసుకోని వాళ్ళు ,,
ఎంటబడి తరిమింద్రు ,,
పారిపోతున్నట్టి ,,
తేళ్ళ యనాసమ్మ ,,
కాలువగెడ్డ తగిలు ,,
కింద పడ్డాడమ్మ ,,
కిందపడ్డా అన్నను ,,
గొడ్డళ్ళతో నరికిరు ,,
కణతమీదా ఒకడు ,,
గడ్డపలుగుతో పొడ్చె ,,
రెండు కణతల గుండా ,,
భూమిలోకి దిగిన ,,
గడ్డపారను లాగి ,,
ఊడి రాలేదని ,,
తలమీద కాలేసి ,,
గడ్డపలుగును లాగిరు ,,
చచ్చాడా లేదని ,,
అనుమానము వచ్చి ,,

| | | | |
|---|---|---|---|
| తలమీద అన్నను | ఉయ్యాలో | చెంగు పట్టుకొని | ఉయ్యాలో |
| రోకలిబండతో | ,, | చీరల్ని చించారు | ,, |
| బలంకొద్దీ బాది | ,, | బరిశెల్తో పొడిశారు | ,, |
| అన్నను జంపింద్రు | ,, | దొరకకుండా తల్లి | ,, |
| యవాసును జంపి | ,, | పరిగెత్తే సెల్లెల | ,, |
| ముందుకెళ్ళినట్టి | ,, | బరిశెలు యిసిరేసి | ,, |
| అసాములకేమొ | ,, | పడగొట్టినారమ్మ | ,, |
| నై పోగు లూచిమ్ముతు | ,, | పడిపోయి నక్కల | ,, |
| బ్రాందీలు తాగింద్రు | ,, | పశువుల్లా చెరిచింద్రు | ,, |
| దుడ్డు రమేషన్న | ,, | చెరిచింది గాకమ్మ | ,, |
| కంట పడ్డాడమ్మ | ,, | ఎంతపని చేసింద్రు | ,, |
| కంటపడినా అన్నను | ,, | క్రూరజంతువులన్న | ,, |
| వెంటబడి నరికారు | ,, | ఇంతపని జేయవు | ,, |
| బరిశెలతో పొడిసి | ,, | కఱ్ఱలు కట్టెల్తో | ,, |
| బలిదీసుకున్నారు | ,, | మానంలో పొడిసింద్రు | ,, |
| పంట సేలల్లోన | ,, | నెత్తురు మడుగుల్లో | ,, |
| నెత్తుర్ని పారించి | ,, | ముంచి లేపింద్రమ్మ | ,, |
| దండుగా దుండగూలు | ,, | గర్భిణీ స్త్రీలను | ,, |
| కాలువొడ్డూకెళ్ళి | ,, | కడుపుమీదా తంతె | ,, |
| నీళ్ళలో బట్టల్ని | ,, | కడుపులోనా బిడ్డ | ,, |
| ఉతికేటి సెల్లెళ్ళను | ,, | కాటిపాలై పోయె | ,, |
| జుట్టు పట్టుకోని | ,, | పరిగెత్తి పోయేటి | ,, |
| ఈడ్సుకొచ్చినారు | ,, | ముత్తయ్య మోషేను | ,, |
| సరివి బాదులతోటి | ,, | ఏటకుక్కల్లాగ | ,, |
| సావబాదినారు | ,, | ఎంటబడి తరిమారు | ,, |
| కత్తుల్తో పొడిచేసి | ,, | చీరాల కాల్వకాడ | ,, |
| నెత్తుర్ని పారించిరు | ,, | చుట్టుముట్టారమ్మ | ,, |
| గొత్తెలా గుంపుపై | ,, | బరిశెను పైకెత్తి | ,, |
| తోడేలు దుంకితే | ,, | కడుపులో దించింద్రు | ,, |
| గుంపు చెదిరినట్టు | ,, | పప్పుగుత్తిలాగ | ,, |
| చెల్లెల్లు చెదిలింద్రు | ,, | కసితోటి తిప్పింద్రు | ,, |
| చెదిరినా చెల్లెల్లను | ,, | చిక్కినా అన్నల్ని | ,, |

గంద్రగొడ్డళ్ళతో ఉయ్యాలో
కండకండకు వాళ్ళు ,,
క్రూరంగ నరికింద్రు ,,
కొడుకుల్ని తల్చుకోను ,,
కొనవూపి రొదిలింద్రు ,,
గిలగిలా తన్నుకొని ,,
ప్రాణాలు వదిలారు ,,
పల్లె పల్లెంతాను ,,
నెత్తురు మడుగాయె ,,
ఎవరి ప్రాణం వాళ్ళు ,,
దక్కించుకోవాలను ,,
తల్లులు పిల్లలు ,,
ఒకరిని ఇంకొకరు ,,
పట్టించుకోకుండ ,,
పరుగుదీసింద్రమ్మా ,,
ప్రాణాలు నిల్పుకోను ,,
చీరాల చేరింద్రు ,,
చర్చి కాంపౌండులో ,,
వచ్చిపడ్డారమ్మ ,,
ఇంత జరిగినగాని ,,
ఎంటి రామారావు ,,
దాడికాదు యిది ,,
ఘర్షణే అంటుండు ,,
చావగొట్టి తల్లి ,,
చెవులు మూసినట్టు ,,
సాపుబతుకుల్లోన ,,
గుంటూరు లున్నోళ్ళకు ,,
పండ్లు తెచ్చి యిచ్చి ,,
దొంగ ఏడ్పు ఏడ్చె ,,
చీరాల రాలేదు ,,
శిబిరంకు రాలేదు ,,
ఘోరాలు జేసినోళ్ళు ,,

నడిబజారులోన ఉయ్యాలో
రొమ్ము యిరుసుకొని ,,
తిరుగుతున్నాగాని ,,
అసలైన వాళ్ళను ,,
అరెస్ట్ చేయకుండు ,,
పైపైన వాళ్ళను ,,
పట్టుకున్నారమ్మ ,,
అరెస్ట యినోల్లుకూడ ,,
అల్లుల్ల మాదిరి ,,
పోలీసుస్టేషన్లో ,,
పలావులు దింటుంద్రు ,,
తెలుగుదేశం పార్టి ,,
మేలుచేయదాని ,,
కాంగిరేసూ పార్టి ,,
హరిజనుల పార్టని ,,
అంజయ్య, రోశయ్య ,,
వెంగళారావులు ,,
న్యాయమూ కోసమూ ,,
పోరాడుతామంటు ,,
ఊగూగి మాట్లాడి ,,
రంకెలూ వేసింద్రు ,,
రామారావు పిల్చి ,,
రాజీ చేసుకుంటే ,,
కారంచేడూ ఊసు ,,
వదిలేసినారమ్మ ,,
అక్కలారా మీరు ,,
ఆలోచించండమ్మ ,,
అన్నలారా మీరు ,,
ఆలోచించండన్న ,,
కాంగిరేసైనను ,,
తెలుగుదేశమైనను ,,
దొందు దొందేనమ్మ ,,

దోపిడీ పార్టీ లె ఉయ్యాలో
కాంగిరేసు కాలంలో ,,
కంచికచెర్ల లో ,,
కోటేసు అన్నను ,,
కాల్చిచంపలేద ,,
నిన్నగాక మొన్నే ,,
ఉత్తరప్రదేశ్ లో ,,
రాస్పావల గ్రామంలో ,,
భూస్వాములందరూ ,,
హరిజనుల నందర్ని ,,
కాల్చి చంపలేద ,,
లెక్కేమి చెప్పేది ,,
లక్షలో జరిగాయి ,,
భూస్వాముల రాజ్యము ,,
ఉన్నంత వరకమ్మ ,,
పేదోళ్ళకూ న్యాయము ,,
జరగబోదూ తల్లి ,,
పేదోళ్ళ చేతికీ ,,
రాజ్యమూ రాకుండ ,,
పేదోళ్ళ బతుకులు ,,
పేదోళ్ళ గాథలూ ,,
మారేది లేదమ్మ ,,
తీరేది లేదమ్మ ,,
పేదోళ్ళ రాజ్యమూ ,,
సాధించాలంటేను ,,
పోరుదప్ప మనకు ,,
వేరేదారీ లేదు ,,
మన రాజ్యమూ కొరకు ,,
మన అన్నలెందరో ,,
ఆయుధా లందుకోని ,,
పోరాడుతున్నారు ,,
తెలంగాణమంత ,,
తెగబడి నిలచింది ,,

మన్యమడవుల్లోన ఉయ్యాలో
మంట రగిలిందమ్మ ,,
గడ్చిరోలిలోన ,,
గిరిజనులు కదిలింద్రు ,,
బస్తరడవుల్లోన ,,
బందూకు పట్టింద్రు ,,
ధర్మపురిలోన ,,
దండు కదిలిందమ్మ ,,
ఆళ్ళేంది ఈళ్ళేంది ,,
అన్నార్తులందరూ ,,
సంఘంగ కూడింద్రు ,,
సంగతులు తెలిసింద్రు ,,
తుపాకీ రాజ్యాన్ని ,,
తుపాకీతోనమ్మ ,,
కూలదోయాలని ,,
కొట్లాడుతున్నారు ,,
రాడికల్స్ వాళ్ళూ ,,
రైతుకూలి గుండెలు ,,
గోదారిలా పొంగింది ,,
రాదారి చూపింద్రు ,,
ఆదారిలోనే మనము ,,
పోరాడితేనమ్మ ,,
మన బతుకు మారును ,,
మన వెతలు తీరునూ ,,
అక్కలారా మీరు ,,
ఆలోచించండమ్మ ,,
అన్నలారా మీరు ,,
ఆలోచించండన్న ,,
పదిమందికీపాట ,,
పాడి వినిపించండి ,,
పాటకాదు ఇది ,,
పేదోళ్ళ గాథమ్మ ,,

జ్ఞాపకాలు :

# కామ్రేడ్ రాజన్న మార్గం

పి. శివయ్య

జిగి బిగి అల్లికదారులు.... మైదాన ప్రాంతమే అయినా ఈ దారులవెంట అనుకున్న ఊరు వెళ్ళడం కొత్తవాళ్ళకు కష్టము....

ఓసారి ఏమయ్యిందంటే.... వద్దు!.... ఏది మనసులో నుండి తరిమేయాలనుకుంటామో పదే పదే అదే ముందు నిలబడుతుంది.... ఘటనలు తప్పేకో వద్దు- రోజులు, ఉదయాలు, సాయంత్రాలు — ఊపిరి సలుపని ఘటనల దొంతరల మధ్య వెనక్కి-తిరిగి చూసుకుంటే అప్పుడే ఎనిమిదేండ్లు ఎనిమిది రోజుల్లా గడిచిపోయాయి.... ఈ ఎనిమిది సంవత్సరాల కాలంలో ఎంతమంది సహచరులు.... మళ్ళీ తిరిగి తిరిగి అక్కడికే వస్తున్నాయి ఆలోచనలు.... కాని ఈ జీవితం అలవాటయిపోయింది. బహుశా మనసు గడ్డకట్టుక పోయిందేమో ?

ఊరు చేరుకోవాలంటే ఇంకా నాలుగుమైళ్ళన్నా నడవాలి — ఊరి పరిస్థితి ఎట్లున్నదో తెలియదు. అతి ప్రమాదకరంగా ఉండటానికి ఆస్కారం లేదు. వాళ్ళకు కావాల్సిన వాళ్ళు దొరికారు. అంతటతో దుర్మార్గులకు కంటినిండ నిద్ర —

మంగళవారం సాయంత్రం వీధుల్లో బ్రాంది పారిందట - వాడు దుర్మార్గుడైన 'ఆ ఎర్రటివాడు' పోలీసులకు పార్టీ యిచ్చాడట- ఉబ్బిన కండ్లతో- అత్తిరి బిత్తిరి గొంతుతో "వాన్ని సంపినవ్ సర్కిల్‌సాబ్ - నువ్వు పులుల సంపేటోనివి- నాకు ఎనిమిదేండ్ల నుంచి కంటినిండ నిదురలేదు. లేదంటే లేదు-" బొల్లున ఏడ్చిండట— నవ్విండట— 'తనే చంపేద్దునని' జబ్బలు చర్చాడట దొర.

ఎదురుగా కూర్చున్న సర్కిల్ కడుపులో ఏముందో కాని సడీసప్పుడు లేకుంత తాగుతూ కూర్చున్నాడట....

ఆకాశంలో చుక్కలు ఒకటొకటే మెరుస్తున్నాయి. దక్షిణపుగాలి తోలు తోంది. ఎగుడు దిగుడు బండ్లబాట– లోతుగా కోసిన గాడాలు– అ పక్క ఈ పక్క దంతెపొదలు — ఊరు చేరుకోవడానికి బహుశా ఎనిమిది గంటలు కాగలదేమొ — చూద్దాం.

ఎదురుగా అడుగుల చప్పుడు– నిలబడ్డాను. ఒంటిమీద అంగీలేని రైతులా గున్నాడు. అస్పష్టంగా కనిపిస్తున్నాడు.

"ఎవలాల్లు" గొంతులో ఒక విధమైన యాసతో అడిగాడు.

ఏంజెప్పాలే "మనోళ్లలం అంటే" వివరాలు అడుగుతాదేమొ ? ఏదో ఒకటి చెప్పుదామనుకొనేసరికి....

దగ్గరికొచ్చి నిలబడి ఏమనుకున్నదో ఏమో 'పోండ్లి- పోండ్లి- ఎవలో అనుకున్న' రైతు దాటిపోయాడు.

ముందుకు నడిచిన– ఫలానా తాలూకా మనిషినంటే– ఈ గ్రామాల చరిత్ర మార్చిన అతని పేరు చెప్పుకుంటే.... వద్దనుకుంటూనే మళ్ళీ అవే జ్ఞాపకాలు.... అతని చుట్టే ఆలోచనలు.

నవ్వు– నాభిలోనుంచి తన్నుకొచ్చే నవ్వు– ఒక్కసారిగా పెద్ద పెద్ద చినుకులతో వర్షం కురిసినట్టు– గవ్వలు గిలకరించినట్టు– కాదు ఆ నవ్వును పోల్చడానికి ఏ ఉపమానము సరిపోదు, పిడికెడుమనిషి, తెల్లగా పలు వరుస కనిపించేలాగున–చారెడు మేఘం మెరిసినట్లుగా తెల్లగా నవ్వేవాడు. మేం చాలాసార్లు నెమ్మదిగా, చిన్న స్వరంలో మాట్లాడుకోవాల్సి వచ్చినప్పుడు కూడా ఉండి ఉండి అదే నవ్వు నవ్వే వాడు. ఆ కంఠం అంతే స్పష్టంగా తొట్రుపాటు లేకుండా ఉండేది.... మనిషిని చూడకుండా ఆ కంఠం, నవ్వు వింటే ఎంతో భారీ మనిషి అయి ఉంటాడని పించేది....

జోడు విప్ప చెట్లొచ్చినయ్– అంటే ఇంకా రెండుమైళ్ళే నన్నమాట– ఇక్కడెక్కడో చిన్న వాగుండాలె– అక్కడ నీటి చెలిమ ఉండాలె– నీళ్ళుతాగి, కాసిన్ని ముఖంమీద చల్లుకుంటే బావుండును– కాని ఇంకెంతదూరం ? పదిహేను ఇరువై

నిమిషాల్లో చేరుకోవచ్చు- మళ్ళీ మూడు దారులొచ్చాయి- పెద్ద చిక్కొచ్చిందే- మధ్యలోది కాదేమొ? అప్పుడెప్పుడో? సంవత్సరం గడిచిపోయింది ఈ దారంట రాక- బహుశా ఈ ఎడమవేపు.... చూద్దాం....

ఇట్లా జరుగ గలదని ఎవరనుకుంటారు?....

ఆఖరిసారి కలిసినప్పుడు— సంకేత స్థలానికి నడిచి వచ్చేసరికి సమయం మించిపోయింది. అతనికోసం ఉన్న మనిషి వెళ్ళిపోయాడు. ఎవరు తెలియని ఊళ్లో.... ఎట్లా ఎట్లా? ఎటుపోవాలన్నా యాభై మైళ్ళు నడువాల్సిందే- మసక మసక చీకటి- అలసట- తప్పదు కదా! విప్లవకారుని జీవితంలో అలసట అనుకుంటే అంతేమరి... అన్ని పనులు ట్రిగ్గర్ మీద వేలులా ఉంటాయి. ఎక్కడ తేడావచ్చినా మొత్తం వ్యవహారం కుప్ప.... అప్పుడు తెలిసినముఖం కనిపించిందట— అతని సహాయంతో ఒక షావుకారి ఇంట్లో పడుకున్నారట. వాళ్ళు పండుకున్న ఇంట్లో షావుకారి దేశ కాలాల గురించి మాట్లాడి 'మరింక పౌరకలసార్లు ఏమంట మన జిల్లాలకు వచ్చిండ్లో నిదుర పోతె ఒట్టు—' అన్నడట— 'వాడికి నేనే పౌరకల సారునని చెప్పుతే ఎట్లుండునో చూడాలనిపించింది' అంటూ అదే నవ్వు - గల గల....

ఆ రాత్రి అలసిపోయి నాకన్న ముందే పడుకున్నాడు— రెండుగంటల రాత్రి నిదురలో కలవరింత 'అవగాహన లోపం' అంటూ, లేపి కూర్చుండబెట్టాను....మళ్ళీ పడుకోమన్నాను. అట్లాగే ఆలోచిస్తూ కూర్చుండి సిగరెట్టు తాగిండు- తర్వాత అది సరిపోక గణేశ్ బీడీ ముట్టించి "నిజంగా అవగాహన లోపం కాదంటావా? మనం చావకుండా ఉన్నదెప్పుడు? ఓగించి మొక్కనుంచి రావాలంటే ఎంతోకొంత నెత్తురు బర్న (కాలి) కావాల్సిందే- ఓ యంత్రం తిరగాలంటే, అంతెందుకు ఈ ప్రపంచం కదిలి జెగ జెగ లాడాల్నంటే దీనికి ఎంతోమంది శ్రమ— అదే జీవరక్తం కావాల్సిందే- మన ఉద్యమం ఒక జీవనసరళి- ఇందట్ల సాపుబతుకులుంటాయి- ఇవి మనకు కొత్తగాదు కనుక ఎన్‌కౌంటర్స్ గురించి ఇప్పుడు కొత్తగా మనం గాభరా పడొద్దు— మన ఉద్యమమేకాదు స్పార్టకస్ నుంచే ఇవున్నాయి...." మళ్ళీ బీడీ ముట్టించి చైనా విప్లవం గురించి మాట్లాడాడు....

అరే ఇదికాదు దారి- ఇప్పటికి వాగు రావాల్సింది. అవతలి ఒడ్డుమీద పెద్ద విప్పచెట్టు ఉండాల్సింది. మళ్ళీ వెనకకు దారి మధ్యదే అయ్యింటుంది. మళ్ళీ వెనక్కి నడిచి నడిందారివెంట సాగాను. కొంతదూరం పోయేసరికి వాగొచ్చింది. అనుకున్న సమయానికన్నా మరో అరగంట ఎక్కువ అయ్యేటట్లున్నది. ఏదిఏమైనా పోలీసుల పెట్రోలింగుకన్నా ముందు పోవాలి.

గ్రామం చేరుకునేసరికి ఎనిమిదిన్నరయ్యింది. అప్పటికే ఊరు విశబ్దంగా ఉన్నది. ఎడంవైపు పెంకుటిండ్లల్లో అక్కడొకటి ఇక్కడొకటి దీపాలు మినుకు మినుకు మంటున్నాయి....ఇండ్ల చుట్టు దడిలాగా పాతిన కర్రలు కడ ఇంటిదగ్గర కని పిస్తున్నాయి. ఆ యింటికి పోవచ్చునో పోరాదో- కొంచెం కుడికి తిరిగితే నేల కొంచెం లోతుగా ఉన్నది. ఆ లోతు ఊరు పక్కనుండి పోయే 'వాగు' వరద కోయగా ఏర్పడ్డది. అది దాటుకొని బండ్ల బాటవెంట కొంతదూరం నడిస్తే ఊడుగు పొదలు, మూడు విప్పచెట్లు ఆ పక్క రెండు చింతచెట్లు వచ్చాయి. చింతచెట్ల కింది కొచ్చేసరికి మళ్ళీ అదే నవ్వు— ఈ చింతచెట్ల కిందనే నా కామ్రేడును రెండవసారి అరెస్టు చేశారు. అప్పుడు 'తునికిఆకు' (బీడీల ఆకులు) పోరాటం ఉదృతంగా నడుస్తు న్నది. 1978 మే మాసపు చివరి రోజులు. అప్పుడు ఒక ఆకుల కట్టకు ధర 5 పైసలు మాత్రమే ఉండేది. కట్టకు నిర్ణీత పరిమాణము లేదు. గంపకట్ట, మైసమ్మ కట్ట అంటూ మొత్తానికి చీకటితో లేచి మళ్ళీ చీకటయ్యే దాకా ఇంటిల్లిపాది పనిచేస్తే పది రూపాయలు కూలి గిట్టడం కష్టం. ఆకులమీద లక్షలు సంపాదించేవారు కంట్రా క్టర్లు. అలాంటి సమయంలో మొత్తం తాలూకాలోని గ్రామాలన్నిటిలో సమ్మె సంఘాల అధ్వర్యంలో ముమ్మరంగా సాగుతోంది. పిడికెడు మనిషి తన సహచరు నితో కలిసి ప్రతి మనిషిని కలిశాడు. కంట్రాక్టర్ల పిలుపుమీద పోలీసులు పిడికెడు మనిషికోసం పిచ్చికుక్కల్లా ఊరూరు తిరిగారు. చివరకు ఈ చింతకిందనే పోలీ సులు అతన్ని చూశారు. బంధించారు. ఇక్కడే నిలబడిన జీబులోకి తోశారు. వార్త పల్లెల్లో గుప్పుమన్నది. ఎక్కడి పనులక్కడే పారేసి, చెమటలు ఓగకారుతుండగా, స్త్రీలు, పురుషులు, పిల్లలనే బేధం లేకుండా పరుగెత్తుకొచ్చారు. కొందరు పండ్లు కొరికారు. మరికొందరు కోపంలోనే ఏడ్చేశారు. జీబుకు అడ్డంగా పోలీసులు చూస్తుండగానే రాళ్ళు పేర్చారు. జనం జీబు కనిపించకుండా, పోలీసులు కనిపించ

కుండా చుట్టూ మూగారు. తిట్లు - 'మా కష్టం సుఖం చూడని బాన్‌కావ్‌లు పిలువంగనే ఉరికచ్చిండ్లా? మీకు సిగ్గు శరాలు లేవు - మీకు కడుపులేదు - మీ కడుపులు కోసేసుకున్నారా? మా కడుపులమీద కొట్టేటందుకు తుపాకు లేసుకొని ఉరికచ్చిండ్లు...'

"మాదిక్కుమల్లె గుడిసెల్ల పుట్టిన పులిపిల్ల-జాగర్త-ఇడువకుంటె" ఒకడు పండ్లు పటపటకొరుకుతూ యస్సైమీద కురికాడు.

పోలీసులు పోలీసు మాటలు చెప్పలేక పోయారు ... మాటలకు తావులేని చోట-న్యాయంముందు అన్యాయం నిలబడ జాలనిచోట - తర్కానికి తట్టుకోలేనిచోట దోపిడి అధికారం ఏమి చేయగలదో? అదే- తుపాకులు గాలిలోకి పేల్చారు.

ఈ గడబిడలో అదేకంఠం విప్పి రాజన్న పోలీసులుండగానే- "మేంఏడికి పోతలేము-మనం లంగతనం దొంగతనం చేస్తలేం- మీరు సమ్మెను కొనసాగించండి-ఒక కట్టకు సూరాకులను, పదిపైసల రేటును ఖరారు చేసుకోండ్లి-మేంమల్లా బేల్‌మీద విడుదలై వస్తాం...."

జనం'కాద'న్నారు. వాడెవడు తీసుక పోవడానికన్నారు. మేం అళ్ళను పోనియ్యమన్నారు. తర్జన భర్జనల అనంతరం ఎట్టకేలకు అనుమతించారు.

జీబు కదిలింది- స్త్రీలు కొందరు పెద్ద పెట్టున ఏడ్చారు ... ఆ విధంగా అట్లా కదిలిన జీబు రాత్రిదాకా తిరిగిన దారుల్లోనే తిరిగి- దారితెల్వక- మల్లా ఇదే చింతల దగ్గరి కొచ్చింది-దారులుకాదు- అంతకు ముందు ఈ ఊళ్ళల్లోని జనం పోలీసులకు తెలియదు, ప్రభుత్వానికి తెలియదు, ఇక్కడ అన్ని అధికారాలు దొరలవే. దొరలే ప్రభుత్వం, దొరలేపోలీసులు.

ఈ పల్లెల్లోకి ప్రభుత్వం, పోలీసులు ప్రజలు కళ్ళుతెరిచిన తరువాతనే ప్రవేశించారు. అది కామ్రేడ్ రాజన్న వచ్చిన తర్వాతనే-ఊరి గుడిసెలు వచ్చాయి.... మామూలుగానైతే కుక్కలు మొరుగుతాయి. పెంకుటింట్లల్లో చివరన ఎక్కడో బలహీనంగా ఒక కుక్క మొరగడం ఉండీ ఉండీ విన్పిస్తోంది.

చాలా ఇళ్ళకు కంక పొరకతో దళ్ళు కట్టుకున్నారు .. ఎండకాలం కనుక ఇండ్లకు దూరంగా కంకపొరకతో నాటి పశువులను కట్టేసు కున్నారు. ఇంటిముందటి

పందిరి కింద చీకట్లో నిలబడి ఆయింటిరైతు పేరు పెట్టి పిలిచాను. చడీ చప్పుడు లేదు.... మళ్ళీ పిలిచాను....

'లేడు ఊళ్లోకెటో పోయిండు' స్త్రీ గొంతు....

'నేనక్కా....'

స్త్రీ అడుగుల చప్పుడుతోపాటే 'గీనాత్రి అక్కలేదు కుక్కలేదు' గుసుసు కుంట బయటకొచ్చింది.

చీకటి నన్ను ఆమె ఎట్లా గుర్తుపట్టాలి— జేబులోని చిన్న టార్చి తీసి నా మొఖంమీద వెలుగు వేశాను....

'ఓ! తమ్మీ నువ్వా - మళ్ళీ నువ్వెందు కచ్చినవ్ తమ్ముడో? లోపటికిరా.... ఏమయ్య లే లే.... ఎంతపని జేసెండ్లు తమ్ముడా! ఓ నా తమ్ముడా! ఆళ్ళింట్ల మన్ను వొయ్య, ఆళ్ళదినాలుగాను, ఆళ్ళ పిట్టకువెట్ట....' నా వొళ్ళంతా పునుకుతూ.... ఏడ్వ సాగింది.

'ఉండే - నీతోని సావచ్చింది. నువ్వు గీనాత్రి శోకాలు మొదలెత్తే ఎవలో అచ్చిండ్లని సుట్టుపక్కలోల్లత్తరు' అన్నాడు గుసగుసగా....

ఆమె టక్కున ఏడ్వడమాపింది. కాని సన్నగా రాగం తీయకుండా ఉండలేక పోయింది. వాళ్ళ రెక్కల్లో బొక్కల్లో మెదిలాడు. వాళ్ళ నవ్వులో, దుఃఖంలో ఉన్నాడు. అతను దిగ్భ్రాంతిగా నిలబడి....

'ఎటన్నపోదాం పోలీసోల్లు గత్తి గత్తి తిరుగుతండ్లు....' అన్నాడు.

'ఆళ్ళింట్ల పీనిగెల్ల - రోకలందుకుంట....' ఆమె.

మళ్ళీ ఏదో యాదికొచ్చి శోకం మొదలెయ్యబోయింది. ఈసారి అతను పండ్లు కొరికి - 'ఉండే. ఏడ్సేడ్సి సత్తవ్ గని - నీ తమ్ముడు గిట్లనే ఏడువు మన్నడా?' కసురుకున్నాడు.

నిజానికి అతను ఆమెకు తమ్ముడు కాదు. ఏ పూరువాళ్లో.... రాజన్న పుట్టిం దెక్కడో! ఏ మట్టివాడల్ల అడిపాడిండో? అయ్య చెన్నూరు తాలూకాలోని పల్లె

తరిమేస్తే బొగ్గుబాయిల్లొచ్చి పడ్డాడు– ముగ్గురు చెల్లెండ్లు ఒక తమ్ముడు సంసారం పెద్దది. తిండికే సాలక – సదువెక్కడ? అయిదో తరగతిలోనే ఆపుచేసి బట్టల దుకాణంలో నౌఖరి చేసిండు. బెల్లంపల్లి వీధుల్లో ఆడిపాడిండు.

బెల్లంపల్లి వీధులను తీర్చిదిద్దుతామని సింగరేణి యాజమాన్యం, దోపిడి దొంగలైన వ్యాపారస్థులు కలిసి ఎమర్జెన్సీ చీకటిరోజుల్లో 'బెటర్‌మెంటు కమిటీ' ఏర్పాటు చేశారు.... సుందరంగా వీధులను తీర్చి దిద్దుతామని బుల్‌డోజర్లతో కార్మికుల గుడిసెలు కూలుస్తుంటె అది అన్యాయమని, అక్రమమని నినదించాడు— రాజేశ్వరి దొరల కామానికి బలైపోతే తను గొంతు విప్పాడు. పోలీసు లాఠీ దెబ్బలుతిని జైల్లోకి పెల్లివచ్చాడు.... ఈ అక్కకు రాజన్న గత చరిత్ర తెలియదు....

నేను 'మీరేమి దిగులు పడకండి– మనం చావకుండా బతికిందెన్నడు?' అందామనుకున్న, కాని కింది పెదవి కొరుకుతూ నిలుచున్నాను.

'ఏడ్సుకుంట కూసుండుడేనా? ఎప్పుడనంగ తిన్నదో?.... ఇట్లా రాండ్లి గకొడార్లె కూసుందురు– ఏషాలేసుకొని తిరుగుతండ్లు. ఇగేం కొండబోతడు లొట్టపీసు....' ముందుదారి తీశాడు.

పందిట్లో అడ్డదిడ్డంగా పేసున్న పిల్లల మంచాలు దాటుకుంటూ గుడిసె వెనుకకేసి నడిచిన అక్క వెక్కడం ఇంకా విన్పిస్తనే ఉన్నది.

మమ్ముల చూసి చొప్పకట్టలమీద ఎడ్లకొల్లు అత్తిరిబిత్తిరి పడ్డాయి. పందిరి కింద కుక్కిన మంచంలో కూర్చున్నాను.

అతను 'ఇంకగీచిన్నె మూత్తన్నవ్, సచ్చిందోనాడు పుట్టిందోనాడంటె ఇనదు. అందరం బతుకిచ్చినమా? నంబైనాలుగేండ్లు బతికిండు. పందులు పదేండ్లు బతుకుతై, పులి తీరబతికిండు, తనకోసం కాదు మందికోసం బతికిండు, మీకు నేను చెప్పుతనా? ఎనకా ముందు పారజూసెటోల్లు ... ఇంక సాతకానోల్లయితే పిట్టకు బెట్టి దినవారాలు జేత్తండ్లు' ఎడ్లముందు కకావికలైన చొప్పగాదెంలో పేస్తూ.... 'ఇగో మందికవద్దం' మాకునివద్ది, అత్తిని, ఎంకటపురం, కుంచెవెల్లి, జనకపురం

వట్టుకొని ఏడ్వనోడు పాపాత్తుడు ... కండ్లల్ల కన్నీయ్యవట్టె- మనిషి సీకటి తీర్గుందెగని- ఆ నవ్వెంత సచ్చెన, పచ్చిపాల తీర్గ, మడుగులనీళ్ళతీర్గ' ఆ రైతు తక్కన ఆగిపోయి కళ్ళు తుడుచుకున్నాడు.... అతను ఏడుస్తున్నాడని చివరిమాటలు మాట్లాడుతుండగా అతని గొంతే చెప్పుతోంది.

నాముందు ఉండలేక వెళ్ళిపోయాడు....

ఆరు నెలలకింద- లారీ ఆక్సిడెంటులో తండ్రి చనిపోతే- రెండు నెలలదాకా ఇంటిచుట్టూ పోలీసులు సివిల్ డ్రెస్సుల్లో కాపలా కాశారు.... కాటిలో బూడిద ఎత్తుకపోయి రాజన్న గంగలో కలిపాడని జనం అనుకున్నారు. చివరకు ఒకరోజు ఇంటికివెళ్ళి గోడకు నిశ్చలంగా నిలుచున్నాడు. తల్లి బొక్కరుమని మీదపడి ఏడ్వ బోయింది. అంతలోనే నోరు పడిపోయిన దానిలాగా అయిపోయింది. గట్టిగా ఏడ్వ రాదు. ఏడిస్తే మంది కూడుతారు. కొడుకు వచ్చింది చూస్తారు. ఏమో ఈ వార్త పోలీసులకు చెబితే- కాని గట్టిగా ఏడ్వకుండ కడుపులసొద తీరేదెట్లా? అమ్మా పేదతల్లి- నీకు ఈ దేశంలో గట్టిగా ఏడిచే హక్కులేదు. ఇప్పుడు, మరిప్పుడు, పల్లెంపల్లి వాడలు దద్దరిల్లే విధంగా- అడవులు, నదీనదాలు, ఈ దేశంలోని నిరు పేద కొడుకులందరికి వినిపించేలాగా ఏడుస్తుంది.... ఏడువొద్దు, ఏడ్వదలుచుకుంటే ఈ దేశంలోని కోట్లాది ప్రజానీకానికి బతుకంతా దుఃఖమే.

అనుకున్న స్థలానికి చేరుకున్నాను. నన్ను తీసుకపోవాల్సిన కామ్రేడ్ రావాల్సి ఉన్నది....

నేను జొన్నగడుక తిని మూతి తుడుచుకుంటుండగా నల్లగా కురుచగా ఉన్న కామ్రేడ్ వచ్చిండు....

మేం బయలుదేరవలసి ఉన్నట్లుగా చెప్పాడు.

'కూసంత గింత ఎండాకాలమెల్లే దన్క- రైలత్‌గుండుండ్లి, గీ దిక్కుమల్లె గుడిసెల్లకు రాకుండ్లి' అక్క చెప్పుతోంది.

మా వెంటనే చాలా దూరందాకా వచ్చి ఏదో పూనకం వచ్చిన వానిలాగా ఆ రైతు నా చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు.

'అళ్ల నెత్తుటి బాకి తీసుకోకపోతే....నాకు చెప్పండ్లి నాకో తుపాకియ్యండ్లి' మరింక మాట్లాడలేకపోయిండు.

'ఇది ఇప్పటిదా?' అన్నాడు నాతోటి కామ్రేడ్....మళ్ళీ తనే 'ఎందరం సచ్చినా, నెత్తుటిబాకి తీయడం ఖాయం' అన్నాడు.

నా చేతిలోని ఆ రైతుచేయి వెచ్చగా....నేను రైతు విడిచిపెట్టిన చేయిని ఊపుకుంటూ ముందుకు నడిచాను....

పైన దిగాలుపడ్డ ఆకాశంలో చుక్కలు, మిలుకు మిలుకు మంటూ విశ్వాసం లాగా....చిమ్మెట్లురొదగా పలుకుతున్నాయి. మేం చీకట్లోనే నడుస్తున్నాం. దారి పరిచయమున్నవాడు కనుక కామ్రేడ్ సరసరా నడుస్తున్నాడు....నాకు కొంచెం కష్టంగానే ఉన్నది....చేలు చెలుకల మీదుగా తీసుకుపోతున్నాడు....మాకు కుడిపక్క ఎక్కడో గుడిసెలున్నట్లు సన్నగా వెలుగు....ఎడంకేసి ఎక్కడో షికారు కొచ్చిన వాళ్ళు బ్యాట్రీలైటు చుట్టూ తిప్పుతున్నారు. మేం ఆ గుడిసెలు చుట్టేసి ఆ వెలుగుకు దూరంగా నడిచాము....

నావెంట నడుస్తున్న కామ్రేడ్ పట్టుకున్న చేతిసంచిలో నీళ్ళ డబ్బా ఉన్నది. ఆగి తాగాము....మళ్లీ నడక సాగించాము....

నడుస్తు నడుస్తూనే నాకు చెప్పుతున్నట్లుగానో, తనలో తను గొనుక్కున్నట్లు గానో తెలియకుండా కామ్రేడ్ మాట్లాడసాగిండు. '78 ఆగష్టులో వర్షాలు తగ్గినయ్.. తాలుకాలో గస్తిగస్తి తిరిగి పెద్ద ఎత్తున భూములు దున్నించినం. గిరివిబడ్డ భూములు, కుంచెడుమంచెడు కింద దొరలుకబ్జా చేసిన భూములు, పెండ్లి పేరంటాలకు అప్పులిచ్చి షావుకార్లు గుంజుకున్న భూములు రాజన్న దున్నిచ్చిండు....కుదువబడ్డనగలు, ఎడ్లు అన్నీ ఇప్పించిండు....రాజన్న ఊరూరుకు తెలిసిపోయిండు- అదొక పెద్ద గాడుపు దుమారం- ఊరూర పంచాదులే- పంచాతులు తీర్పు చెప్పేది నిరుపేదలైన పబ్లిక్- దీనితోని ఎంకటపురం కోమటోనికి ముడ్డికింద మంటబెట్టిన సందమయ్యింది. ఊరి దొరకు కాళ్ళకింద నేల కదిలిపోయింది....





ఇద్దరు కలిసిండ్లు రాజన్నను కోమటోనింట్ల కట్టేసిండ్లు - నాలుగురోజులు కోమటోడు, దొర కలిసి కొట్టిండ్లు - అప్పటికే ఊళ్ళన్ని పోలీసులు బడి చిల్లం కల్లం చేసిండ్లు - ఇది మొదటి దెబ్బ....' ముందుపోతున్న కామ్రేడ్ ఆగి వెనక్కి తిరిగి చూశాడు.

'ఇప్పుడా మీసాలపోలీసోడు ఎక్కడ పనిచేస్తున్నట్టు'. నేను అడిగినాను.

ఎక్కడ పనిచేస్తున్నాడో చెప్పిండు. 'నాలుగోనాడు పోలీసులు పిలిచిండ్లు. పిరిసెడు పిరిసెడు మీసాలుగల పోలీసొకడు రాజన్న మీసాలు చూసిండు. 'నువ్వా: మీసాలు పెంచుతావుర:....' అనుకుంట రెండుచేతులతో రెండుమీసాలు పట్టి నిలిపె దెత్తులేపి కింద దించిండు-రెండు చేతుల్లో పీక్కొచ్చిన మీసాల వెంట్రుకలు-పెదిమల మీద నెత్తురు....రాజన్న అదే చూపు....పోలీసు తన ఉద్యోగంలో ఎన్నడు చూడని చూపు....మళ్ళీ కొట్లు, తన్నులు, చిత్రహింసలు-ఆ కళ్ళల్లో నీళ్ళులేవు .... ఆ వొంట్లో భయంలేదు. వాళ్ళు అడిగిన అనేక ప్రశ్నలకు ఒక్క జవాబులేదు....కోమటోడు, దొర పిలిపించిన పోలీసులు రాజన్నను పెడరెక్కలు విరిచి కట్టేసి-ముప్పై మైళ్ళు నడిపించుక పోయారు....'

అప్పటికి తోవతప్పిపోయినట్లుగా కామ్రేడ్‌కు అనుమానం కలిగింది. నన్ను అక్కడే నిలబడమని-గుర్తులకోసం అటుయిటు తిరిగివచ్చాడు. కాసేపు కూర్చుంటే బావుండును. కాని ఒకసారి కూర్చుంటే మళ్ళీ లేవడం కష్టం-

మేం అక్కడినుండి అడవిలో ప్రవేశించాలి....అక్కడక్కడ దంతెపొదల స్థానే తునికి గుబుర్లొచ్చాయి పెద్దపెద్ద రాళ్ళ దారిలో కొంతదూరం నడిచేదాకా అతను మాట్లాడకుండా ఆ చీకట్లో గుర్తులకోసం చూస్తూనే ఉన్నాడు. మా ఎడంపక్క బండ్ల బాట-అప్పుడు సంతృప్తితో నిట్టూర్చిండు. చిన్న టార్చి తీసి వెలుగు కనిపించకుండా చేతులతోమూసి బండ్లబాటమీద వెతికాం-జీబు టైర్ల అచ్చులులేవు-బూట్ల అచ్చులుకూడా లేవు.

మళ్లీ ఇద్దరం నడుస్తున్నాం గాలికి చెట్లు కదులుతూ కిర్రుకిర్రుమని శబ్దం చేస్తున్నాయి-కుడిపక్క దూరంగా 'ఎలుగడి' పడి కంకబొంగులు 'ఫట్ ఫట్'మని కాలుతున్నాయి....ఆకులమీద అడుగులుపడి 'పర్ పర్'మంటున్నాయి .... ఎండుటాకులు లేనిచోట బొడిగెరాళ్ళు కాళ్ళకింద - కర్రుకిర్రు మంటున్నాయి.

మధ్యమధ్యలో ఆగుతూ-చెవులు రిక్కించి శబ్దాలు వింటూ కామ్రేడ్ ముందు నడుస్తున్నాడు-కొండెంగలు కీచుకీచుమంటున్నాయి....అడివికోళ్ళు కాలింగ్ బెల్ శబ్దం లాగా 'బుడుంగ్ బుడుంగ్'మంటున్నాయి....

ఇద్దరం ఎవరి ఆలోచనల్లో వాళ్ళం నడుస్తున్నాం. ఇద్దరి మనసుల్లో మా పక్కపక్కనే నడుస్తున్నట్లుగానే మా కామ్రేడ్-మా కామ్రేడ్ రాజన్న జ్ఞాపకాలు... తల ఎగరేస్తూ పరుగులాంటి అతని నడక-ఆ నవ్వు-ఎప్పుడూ విప్లవంతప్ప ఇంకో ఆలోచనలేని జీవితం-

గ్రామ గ్రామానికి మనుషులున్నారు. ఈ మనుషులంతా చెట్లలో చెట్లోలె బతికారు....రోగాలతో రొస్టులతో-తన్నులమధ్య తాపులమధ్య బాంచె బతుకులు బతికారు. అలాంటి బతుకుల్లోకి 'పీపుల్స్‌వార్ పార్టీని' తెచ్చింది నిస్సందేహంగా రాజన్న. ఈ రోజు ఊళ్ళల్లో తరతరాలుగా నెత్తురుపీల్చిన దొరలు, షావుకార్లు ఉండలేక పట్నాలు పట్టిండ్లు-అడివి మీది అధికారం, ఊళ్ల మీది అధికారం ప్రజలు అనుభవిస్తున్నారు.... కనుకనే రాజన్నను చంపిన వానికి 'రూపాయలదండ లేస్తానన్నడు' ఒకదొర 'కాదు మొత్తం తాలుకాలోని పోలీసులందరికి తాగపోపిస్తానన్నడు' ఇంకోదొర....కాని ఒక విప్లవకారుడు తిరిగిన జాగాలో పడే అడుగులెన్ని? ఆ అడుగుల్లో-ఆ దారుల్లో మళ్ళీ మేం నడుస్తున్నాం....మా అడుగుజాడల్లో మరెంతమందో నడుస్తారు.

మేం ఒక కొండపాదంలోకి చేరుకొన్నాం....పెద్దపెద్ద బండలు, కంకపొదలు రాత్రి కొండ ఎక్కడము కష్టమే....పట్టు తప్పిందో జారి లోయల్లో పడిపోతాం-ఎడం పక్క ఒక కొండ ఉన్నది. మేం ఎక్కేది కుడిపక్క కొండ-

'ఈ చీకట్లో ఎక్కగలమా?' అన్నాను నేను.

'కొంచెం కష్టమే. కాని ఎంతో కొంత ఎక్కి కాసేపు ఆగుదాం - తర్వాత ఆలోచిద్దాం.'

'మనం ఇంకెంత దూరం నడువాల్సి ఉంటుంది?'

'సుమారుగా ఆరుమైళ్ళు నడువాల్సి ఉంటుంది.'

అయితే ఉదయం నాలుగుగంటల ప్రాంతంలో తిరిగి ప్రయాణం మొదలు పెడితే సూర్యోదయంకన్నా ముందే చేరుకోవచ్చు. కొండ ఎక్కుతుంటే మళ్ళీ అదే

నవ్వు. రాజన్న నేను కలిసి ఇలాంటి కొండలు అనేకం ఎక్కాము....ఆ వొంట్లో ఎక్కడ ఉండేదో శక్తి? ఎప్పుడూ అలిసిపోయినట్లుగా కనిపించేవాడుకాదు....

ఈరోజు అడవుల కడుపుల్లో స్వేచ్ఛగా సంచరించ గలుగుతున్నామంటే ఈ దారులు శోధించడంలో–అడవిలో చెట్లోలె, జంతువులోలె బతికే గిరిజనుల హృదయంలో స్థానం సంపాదించడంలో ఎందరో అమరవీరులయ్యారు .... ఇప్పుడు రాజన్నవంతు. రేపు ఇట్లానడిచే మా వంతుకావచ్చు. కాని ఇది ఆగిపోకుండా నిరంతరం జ్వలిస్తూనే ఉండేమంట. రోమన్ సామ్రాజ్యానికి వ్యతిరేకంగా పోరాడిన బానిసలదగ్గరినుండి ఆ మంట జ్వలిస్తూనే ఉన్నది. ఆ మంటకోసం, ఆ వెలుగు కోసం ఎంతోమంది అమరులవుతున్నారు. రెండవప్రపంచ యుద్ధకాలంలో ఒక్క రష్యాయే రెండుకోట్ల మందిని ఈ మంటకోసం అర్పించింది....

నాకు 1980 గుర్తొచ్చింది. పార్టీ పిలుపుమేరకు మొట్టమొదటి దళం అడవిలోకి పంపబడింది. ఏమాత్రం తడబాటులేకుండా, సంశయంలేకుండా రాజన్న దళంలో చేరాడు. అప్పటికే దళాలకు ఆశయం తప్ప ఏమాత్రం అనుభవంలేదు – ఆయుధాలు అంతంతమాత్రమే. ఉన్నవి చాలా మొరటువి. ఆయుధాలు భుజాలకేసుకొని పల్లెల్లో తిర్గడమంటే సామాన్యవిషయంకాదు. అడవిలో అన్నిదారులు తెలియవు. ప్రజల భాషరాదు–అప్పట్లో ఊళ్లోకి దళం వచ్చిందంటేనే ఊరు ఊరంతా తుపాకులను చిత్రంగా చూస్తూ వెంట నడిచేది–తిండి ఎవరు పెట్టాలి? ఎవరిదగ్గరతినాలి? గిరిజన గూడాలల్లో పోరాటం ఎట్లా నడుపాలి? తదితర విషయాలన్నీ నేర్చుకోవాల్సిందే–

అడవిలో దళం తిరిగీ తిరగకముందే మహారాష్ట్ర ప్రభుత్వం అడివి ప్రాంతంలో పోలీసులను పెంచి గాలింపు చర్యలు ప్రారంభించింది. ఒకపక్క–దళంవాళ్లు, రెండోపక్క సాయుధపోలీసులు–ఇంతమంది తమ గూడాలల్లో ఎందుకు తిరుగుతున్నారో గిరిజనులకు పూర్తిగా అర్థం కానిదశ ....

చీకట్లో పునుక్కుంటూ–బండలు తడిమి చూస్తూ జాగ్రత్తగా ఎక్కవలసి వస్తోంది....

మధ్యమధ్య ఆ కామ్రేడ్ నాకోసం ఆగుతున్నాడు. మేం కొంచెం చదునుగల ప్రదేశానికి వచ్చినాము....

'ఇక్కడ ఆగుదాం కామ్రేడ్' అన్నాడు....

ఇద్దరం ఎదురెదురుగా కూర్చున్నాం.

'ఇట్లా వాళ్ళు మనలను చంపుతూ పోతుంటే-మన కామ్రేడ్స్ మానసికస్థితి ఎట్లుంటుంది' ఆ కామ్రేడు అడిగాడు....

'అంతకన్నా మనం ఏమి చేయగలం?'- నేను

'ఏదైనా చేయగలం తలుచుకుంటే....'

'మన కామ్రేడ్స్‌కు ధైర్యాన్ని, స్థయిర్యాన్ని కలిగించే పనులు చేయాలంటావు.'

'అదికాదు కామ్రేడ్ ఎక్కడో అక్కడ ఆపేటందుకు మనం చర్య తీసుకోకుంటే....?'

'మీ సూచన చెప్పండి-చర్చించుదాం' అన్నాను నేను....

అంతటితో ఆ విషయం అప్పటికి అయిపోయిందన్నమాట-నిద్రపోదామనుకున్నాం. మొదట నేను సెంట్రీ చేస్తానన్నాను. ఆ కామ్రేడ్ నిదుర కుపక్రమించాడు-బండలమీదనే ఒక బండ ఆవలికి కాళ్ళుపారేసి తలకింద చేతులు పెట్టుకొని పడుకున్నాడు. నేను సెంట్రీకి వీలైన ప్రదేశాన్ని చూసుకునే ఉద్దేశంతో చుట్టూ చూస్తున్నాను-

'కామ్రేడ్ రాజన్న పెద్దిశంకర్‌తోపాటు దళంలో ఉండేకదా!' అడిగాడు.

నేను ఔనన్నాను.

'అంటే రెండుసార్లు చావు తప్పించుకున్నాడన్నమాట-' అన్నాడు కామ్రేడ్

నేను ఔననలేదు కాదనలేదు. నాకళ్లల్లో ప్రాణహితనది నల్లటి నీళ్ళు - ఆ పక్క ఈపక్క వాగువరద కోసిన ఒడ్లు-ఈ పక్క నీల్‌వాయి ఊరు. జొన్నచేలు-ఆ వొడ్డు జొన్నచేలు-గుట్టబోరుకింద మొహిన్‌బిన్‌పేట-ప్రాణహితనదికేసి ఉన్న 'గొట్టె'వాళ్ల ఇండ్లు- 'కిట్‌బ్యాగుల'తో దళం ఊరుసొచ్చింది-దళం వెను వెంటనే పోలీసులొచ్చేది దళానికి తెలియదు-తీరా ఊళ్ళోకొచ్చిన తరువాత పోలీసులరాక

తెలిసింది. వాళ్ళు కొండదిక్కునుండి వస్తున్నారనుకొని వదికేసి నడిచారు....మైదానంలోనే పోలీసులు, దళం చెరో పక్కనుంచి వచ్చి కలిశారు. కాల్పులు....పెద్దిశంకర్ జొన్నచేలో వొరిగిపోయాడు. రాజన్నతోపాటు మిగతా వాళ్లంతా పరుగెత్తారు. రాజన్న తనో దిక్కు పరుగెత్తాడు....మూడురోజులు అడవిలో తన సహచరులకోసం వెతికాడు....అప్పుడు వెంట్రుకవాసిలో చావు తప్పించుకున్నాడు.

కామ్రేడ్ సన్నగా పెడుతున్న గురక విన్పిస్తోంది....కిందిగుట్ట - పరదవెంట గుడ్డేలుగు అరుపు విన్పించింది....కొంచెం పేపటికి ఎండుటాకులమీద అడుగుల చప్పుడు పరపర- మనుష్యుల వాసన గుర్తు పట్టిందన్నమాట- రివాల్వరు తీసి గురి చూశాను....చీకట్లో రెండుకళ్ళు మెరిశాయి. అవి అక్కడే నిశ్చలంగా ఆగిపోయాయి గుడ్డేలుగు ఏమనుకున్నదో ఏమో? కిందికేసి దిగిపోయింది....

అడివి ఎలుకలు ఎండుటాకుల్లో బొలాబొలా తిరుగుతున్నాయి. ఎలుగడిబిడ్డ దగ్గర కంకబొంగులు తుపాకులు పేల్చినట్లుగా పేలుతున్నాయి. గుడ్లగూబలు కూస్తున్నాయి. మొత్తానికి అడివి సందడిగానే ఉన్నది. నాగుండె కొట్టుకోవడం నాకే విన్పిస్తోంది.

మళ్లీ ఆలోచనలు....విప్లవ కార్యాచరణ ఎంత సంక్లిష్టమైంది! ఈ దారి ఎప్పటిదో అయినా? ప్రతీదీ నేర్చుకోవడమే!....ఆయుధాలను మెరుగుపెట్టడం దగ్గరి నుండి, దారి కనుక్కోవడందాకా ప్రాణాలు అర్పించడమే! .... గజ్జెల గంగారాం పగంనోరు తెగి భయంకరంగా ఉన్నప్పుడు ఆ పక్కనే రాజన్న....

ఆ వీర కామ్రేడ్‌కు చేసిన సైనికవందనంలో....రాజన్న తొడలోనుంచి బుల్లెటు దూసుకపోయింది-

ఒక్కొక్కటే గుర్తుకొస్తున్నాయి. ఈ జ్ఞాపకాలు రెండు గంటలు....ఆ తరువాత కామ్రేడ్‌ను లేపి సెంట్రీ ఉంచి నేను పడుకున్నాను....రాజన్న జ్ఞాపకాలు మరింక ఆ కామ్రేడ్‌ను వెంటాడుతాయి. నేను కళ్ళుమూసుకున్నాను....

o o o

మేమిద్దరము 'పటారు' మీద నడుస్తున్నాము .... ఆ పటారుమీదనే అక్కడక్కడ దున్నిన చెలుకలు-మొత్తం బాటంతా 'మెకాల' గొతికెలు కనిపించాయి....

ఆ పటారు నీదిగుండా తిరిగి తిరిగి ఒక గుట్ట అంచుకు చేరుకున్నాము. గుట్టదిగడం ప్రారంభించాం-పదిగజాలు దిగామోలేదో ఒక ఎర్రటి పిల్లవాడు, మరొక నల్లటి పిల్లవాడు తవిసిచెట్లకు జిగురు తీస్తున్నారు. నాతో వచ్చిన కామ్రేడ్ 'రాంరాందాదా' అన్నాడు. వాళ్ళు రాంరాం చెప్పారు....

మేం ఇంకొంచెం కిందికి దిగాం-నా తోటి కామ్రేడ్ సంకేతానికి జవాబొచ్చింది ...మరికొంత దూరం నడిచాం-సైనిక దుస్తులు ధరించిన మహిళా కామ్రేడ్ గన్‌తో సెంట్రీ చేస్తున్నది... నన్ను చూసి పిడికిలెత్తి సలాం చెప్పింది....ఇంకా కొంచెం దిగాం. రెండు కొండలమధ్య పెద్దలోయ-తునికి చెట్టుకింద సైనికదుస్తుల్లోని మా కామ్రేడ్స్ ఎదురొచ్చి లాల్‌సలాం చెప్పారు.

కొందరు కౌగలించుకున్నారు. మరికొందరికి కళ్ళల్లో నీళ్లూరినయ్. అందరి మనసుల్లో నాతో కలిసి వచ్చే రాజన్న....వాళ్ళ సహచరుడు-మరింకలేడు .... వాళ్ళు పెద్ద గండంను దీ బతికి బయటపడ్డారు-విప్లవకారుని జీవితం అడుగడుగు అత్యంత ప్రమాదకరమైంది-విప్లవం భయంకరమైంది, నిర్దాక్షిణ్యమైంది. విప్లవంలో పక్క సహచరుడు కూలిపోతే-అతని చేతిలోని జండా ఎత్తుకొని నడువ వల్సిందే....

అందరి మనుసుల్లో ఎంతో బరువు-

కాలకృత్యాలు ముగించుకొన్న తరువాత-

సెంట్రీ డ్యూటీనుండి వచ్చిన మహిళా కామ్రేడ్ తుపాకీమీద దరువేస్తూ గొంతెత్తింది. మేమంతా సైనిక దుస్తులో ఉన్నాం ...కంకబొంగులో గాలి ఊదినట్లు పిల్లంగ్రోవి మోగినట్లు-ఎక్కడా జీర లేకుండా-

'రేలా నాయిరేలా-

రేలరేలరేల....'

ఆకులు ఊగేలాగా....చిమ్మెట్లు సుతిపడుతుండగా, అడవి అడవంతా తెరలు తెరలుగా-బండబండ చుట్టూ రాగం గిరికీలు కొడుతుండగా కంఠం మోగుతోంది.... అది దుఃఖంకాదు-అది అనేక రసాల సమన్వయం అందులో గలగల నవ్వే కురుచ మనిషి రాజన్న హీరో....అతను అడవిలోని పల్లెల్లోకొచ్చాడు. జంగ్లాతు అధికార్లతో షావుకార్లతో సతమతమౌతున్న గోండు, గొత్తె, కొలాం దాదాలను కుప్పజేసిండు. 'మరట్ తుడుం పాయానా' అన్నడు-మనది అడవి, మనది చెట్టు, మనయిభూములు

అన్నాడు....అడవి అడివంతా ఏకమైంది....చౌకీదార్లు పారిపోయిండ్లు-పట్టేదార్లు పారిపోయిండ్లు అందరు పోయినంక పట్టేదార్లు మరో అవతారమెత్తి అడివివారికి అమ్మ సాగిండ్లు, అప్పుడు రాజన్న-అడివివారికే అధికారం దొరలకు లేదన్నడు. వాళ్ళ బండ్లను సంఘాలు జప్తుచేసినాయి. దొరల ఇండ్ల లోని కర్రతీసి జనం పంచుకున్నారు....అడివిలోని ఆకులు, కర్ర అమ్ముకొని బంగ్లాలుగట్టిన దొరలకు కోపం వచ్చింది. వాళ్ళు పోలీసుల తెచ్చిండ్లు....రాజన్నను పోలీసులు కాల్చేసిండ్లు - కాని రాజన్న రైఫోలు మా దగ్గరే ఉన్నది-రాజన్న చెప్పిన మాట మా మెదళ్లో ఉన్నది' అంటూ పాట ముగుస్తుంది.

నా కళ్లల్లోకి నీళ్లొచ్చినయ్. ఎక్కడో ఏ గుడిసెలల్లోనో-చాలి చాలని బతుకు గడిపే ఆకలి ముఖాల గోండు చెల్లెమ్మలకు చేతుల్లోకి తుపాకులొచ్చాయి-అన్ని కష్టాలకు 'దేవరలమీద' గాదిగే గోండులు ప్రపంచపురీతి తెలుసుకుంటున్నారు .... ఈ దీర్ఘకాలిక యుద్ధం ఎవరెవరిని ఎట్లా మలుస్తుందో ఎవరికి తెలుసు?

తర్వాత లోగొంతుతో కమాండర్ ఘటనకు సంబంధించిన వివరాలు చెప్తూ కొచ్చాడు. అందులో రాజన్న ఆఖరు మాట....

ఆ తరువాత ఇటీవలి పోరాటాలు....అనేక వివరాలు....

ఒక గ్రామంలో మొత్తం భూమంతా పట్వారిదే. వాడిది పట్టా అంటారు. రైతులు, రైతుకూలీలు పట్వారిని పంచాదులోకి పిలిచి నీకిన్ని ఎకరాల భూమెందుకు అన్నారు. అది నా పట్టా అన్నాడు వాడు....మేం గుంటెడు భూమిలేకుండా ఉన్నాము. మంచి మాటకు మాకు సగంభూమి యివ్వండి అన్నారు. వాడు యివ్వలేదు. ప్రజలు సగంభూమి ఆక్రమించుకున్నారు....ఊరూర జరిగిన తుని కాకుల పోరాటాలు....

నల్లగా కురుచగా ఉన్న కామ్రేడ్ 'మనం ఏదైనా చేయవలసిందే!'అన్నాడు.

'వాళ్ళు క్రూరంగా దాడులు చేస్తున్నారు. ఊళ్ళల్లో ఎవరిని చితకకొడుతారో తెలయదు. ఎవరిని కాల్చివేస్తారో తెలియదు....నేను ఇక్కడ ఇద్దరిని చంపనిదె పోను, ఆఖరుకు లీగల్‌గా పనిచేసే వాళ్ళనన్న అన్నాడట సర్కిల్. కనుక అలాంటి పిచ్చికి ఏదో ఒక....' మరో కామ్రేడ్....

'రెండు సంవత్సరాలనుండి రెండువందలమందిని నిద్ర ఆహారాలు తిననిత్త లేవ్-నువ్వు పిరికెదే ఉన్నావురా? అన్నాడట యస్.పి....' ఇంకో కామేడ్ ఇట్లాంటి మాటలు అనేకం చెప్పుకొచ్చారు.

మొత్తానికి అత్యంత ప్రమాదకరమైన పరిస్థితుల్లోకి నెట్టబడ్డామన్నారు....ఏదో ఒకటి చేయాలన్నారు-ఇది మొత్తం కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల కుట్ర. అన్నారు. అందుకు వాళ్ళు ఎలక్షన్లో గెలవడమే కారణమన్నారు. ఎండాకాలం విప్లవకారులకు శత్రువన్నారు-ఇదే ఎండకాలంలో ప్రపంచ విప్లవాలల్లో శత్రువు పురోగమించాడన్నారు-కనుక ఎండకాలం ఓపిక పట్టాలన్నారు-ఎదురుదెబ్బ తీయాలన్నారు. భారత దేశంలో జరిగిన విప్లవాల వైఫల్యాలు ఏకరువు పెట్టుకున్నాం-శ్రీకాకుళాన్ని మళ్ళీ మళ్లీ తవ్వుకున్నాం....

అంతిమంగా-అందరి మాటల సారాంశంగానూ-నేను 'కామేడ్స్, నిర్బంధం అనివార్యం....యుద్ధం యొక్క స్థితి, బలాబలాల ననుసరించి దీని తీవ్రతలో తేడా ఉండవచ్చు. మనది దీర్ఘకాలిక ప్రజాయుద్ధం-ఇందులో కాలానుగుణంగా ఎత్తుగడలు రూపొందించుకున్నవాడే ఉంటాడు. శత్రువు గొంతుమంటి సంక్షోభంలో కూరుకపోయి ఉన్నాడు కనుకనే బలహీనమైన కుక్కలాగా పళ్ళు గిలకరించి క్రూరంగా ఎగబడుతున్నాడు. ఒకపక్క హిట్లర్ కన్న భయంకరమైన చట్టాలు తెస్తూనే మరొకవంక అప్పులకోసం దేశాలు తిరుగుతున్నాడు-దాదాపు అన్ని రాష్ట్రాలల్లో ఏదో ఒక పేరుతో పోలీసు తుపాకి ప్రజల గుండెలమీదికి ఎక్కుపెట్టబడి ఉన్నది. అది పంజాబు, ఈశాన్యరాష్ట్రాలు లేదా మనమేకావచ్చు.'

'కామేడ్స్ ...' నా గొంతు వణికింది.... తుపాకి మీద నా చేయి... నా సహచరుడా, రాజన్నా నీ స్థానంలో నిలబడి కదా నేను మాట్లాడుతున్నాను. అనే భావం నా శరీరమంతా పాకింది. పైన ఆకాశం-కింద కొండలు-మా మహిళా కామేడ్ పాట అక్కడెక్కడో తిరుగుతూ వుండి ఉంటుంది. ఈ ఆలోచనలతోనే నేను నా సహచరులందరి ముఖాలల్లోకి చూశాను. వీళ్ళంతా గ్రామాలు తరిమేసిన బిడ్డలు-వీళ్ళంతా అడివి పుత్రులు-వీళ్ళంతా వెంపటాపుసత్యం, ఆదిభట్లకైలాసం, జన్నుచిన్నాలు,

లక్ష్మిరాజం, పోశెట్టి, బత్తులబక్కయ్య, పెద్దిశంకర్, గంగారాం, గంగరాజెం-రాజన్న ....కోట్లాది మృతవీరుల ప్రతిరూపం....వీళ్ళంతా అజేయ సైనికులు....ఈ భావంతో నా చేయి తుపాకీమీద బిగుసుకున్నది-

'కామ్రేడ్స్-కోట్లాది మృతవీరుల వారసులం మనం-మనం ప్రపంచ పీడిత ప్రజలందరి పక్షాన పోరాడుతున్నాం-మనం ఈ ప్రపంచం యొక్క గతిక్రమం తెలిసిన వాళ్ళం-కమ్యూనిస్టులకు జీవితమెప్పుడు విందుభోజనం కాదు... ఇది ఆరంభమే కాని ఆఖరుకాదు-మనం ఘటనల వెంటపడిపోకుండా-నిరాశపడకుండా-గందరగోళపడకుండా ఆత్మరక్షణతో వాన్ని సంక్షోభంలో ఇరుక్కుపోయే విధంగా చూడాలి. దెబ్బ బలంగా కొట్టడానికి సిద్ధంకావాలి. మనకు అడవి తల్లి అండగా ఉన్నది. మైదానాలను కడుపులో దాచుకుంటుంది. యుద్ధంలో పాల్గొనే శక్తులన్నీ అప్రమత్తంగానే ఉంటాయి. అవి ఒక పద్ధతిలో, ప్లానుతోనే యుద్ధానికి సిద్ధపడుతాయి .... మనం కోట్లాది ప్రజాసమూహాల ఆకాంక్షలకోసం పోరాడుతున్నాం కనుక మనదే అంతిమ విజయం....ఇప్పుడు మనమీద దాడిచేస్తున్న అధికార్లు గులకరాళ్ళు - ప్రజా సమూహాల కాళ్ల కింద దుమ్ముగా నుగ్గునుగ్గయిపోతాయి....'

నా చిన్నారి చెల్లి అదో గొంతుతో 'ప్రజా శత్రువులంతా' అన్నది....

'మట్టికొట్టుకపోతారు.' అన్నాం మేము.

రాజన్న ఆఖరిసారి కలిసినప్పుడు చెప్పినమాట వాళ్లందరికీ చెప్పాను....

'మనం చావకుండా ఉన్నదెప్పుడు-ఒగించు మొక్కనుంచి రావాలంటే ఎంతో కొంత నెత్తురు బర్న కావాల్సిందే-ఓ యంత్రం తిరుగాలంటే ఈ ప్రపంచం కదిలి జెగజిగ లాడాలంటె ఎంతోమంది శ్రమ, అదే జీవ రక్తం కావాల్సిందే-మన ఉద్యమం ఒక జీవన సరళి....'

ఈరోజు ఒక మారుమూల అడవిలో చుట్టూ వేల సంఖ్యలో పోలీసుబలగాలు మోహరించి ఉన్నసమయంలో కొండలమధ్య, అదివాసులమధ్య మేము మా జీవన సరళిని నిర్ణయించుకున్నాం....అది ఒక మార్గం. అది స్పార్టకస్ నుంచి అనేక కోట్ల మంది వీరులు నడిచిన తోవ-అది రక్తసిక్తమైన మార్గం-అది కత్తులవంతెన-అది మానవజాతి విముక్తికోసం నిర్విరామంగా పేద ప్రజానీకం పోరాడుతున్న యుద్ధం ఆ మార్గం ముఖ్యంగా మా రాజన్న నెత్తురుతో కాంతివంతమైంది....

o o o

[ ఆదిలాబాద్ జిల్లా సిరుపూర్ తాలూకా లోద్పల్లిలో మే 13, 1985 రోజున అమరులైన రైతాంగ కార్యకర్తల సంస్మరణలో.... ]

# మైలురాళ్ళు

— సారథి

బస్వాపూర్. ఊరు రోడ్డుకవతల పొలాలు రోడ్డు కివతల ఉన్నాయి. రోడ్డు హైదరాబాద్‌నుండి నాగపూర్‌పోయె జాతీయ రహదారి. ఐదొందల గడపలయినాలేని వూళ్ళో ఒక తునికాకు కంట్రాక్టరున్నాడు. ఒక కల్లు కంట్రాక్టరున్నాడు. కల్లు కంట్రాక్టరు నిజానికి కంట్రాక్టరుకాదు, ఊరుగౌండ్ల సంఘానికి అధ్యక్షుడు. మనదేశంలో ఉత్పత్తి, పంపిణీ ప్రైవేటుగా కాకుండా సమిష్టిగా సాగించాలనే ఆలోచన మూడవ పంచవర్ష ప్రణాళిక కాలంలో బలంగా ప్రవేశించింది రెండవ ప్రణాళికలో దేశంలో ఉన్న పెట్టుబడిదారీ వర్గానికి అవసరమయిన స్టీలు, కరంటు, బొగ్గు వగయిరాలు ప్రభుత్వ యాజమాన్యంలో ఉత్పత్తిచేసి చవకగా ఇచ్చే క్రమం ఆరంభమయింది. ఆ తర్వాత (ఆ తర్వాతే) కమ్యూనిటీ అభివృద్ధి, గ్రామాభివృద్ధి, సహకారసంఘాలు వగయిరా ఆలోచనలు ప్రవేశించాయి. ఈ రెండు భావనలుకూడా రూపంలో విప్లవానంతర సోవియట్ సమాజ ప్రభావంనుండి వచ్చినవి కావడంతో నెహ్రూ గారు సోషలిస్టు అయ్యాడు. (కమ్యునిస్టులు రివిజనిస్టులయ్యారు). కాని ఆచరణలో ఈ సహకార సంఘాలలో సమిష్టిభావన అంటూ ఏమీలేదు. అందుకే ఊళ్ళో జనం అంతా కంట్రాక్టు ఎవరికంటే గౌండ్ల సహకారసంఘానిదనికాదు, బాలాగౌడ్‌ది అనే చెప్తారు. ఆయన అధికార బలంవల్లే ఆ వూళ్లో బాటిల్ రూపాయికి అమ్ముడుపోతోంది. చుట్టుపక్కల గ్రామాలన్నింటిలోనూ డెబ్బైఐదు పైసలే. ఇకపోతే తునికాకు కంట్రాక్టరు ఊరు సర్పంచ్‌కూడా కట్ట బీడికి పదకొండు పైసలిస్తాడు. ఈ మధ్య కాలంలో అది ఇరవయి పైసలయింది. మామూలుగా మార్కెట్‌లో ధరలన్నీ వాటంతటవే పెరుగుతాయి గాని కూలిరేటు మాత్రం తానంతట పెరగదు. నిజానికి బీడీ కట్టలకిచ్చే కూలి తానంతట పెరగ గలిగినా, సహకారసంఘం సమిష్టిగా మిగిలినా బస్వాపూర్‌లో ఎన్‌కౌంటర్ అయ్యుండేదికాదు.

కొన్నాళ్ల క్రితం రాడికల్స్ ఈ గ్రామంలో ప్రవేశించారు. వాళ్ళ ఆందోళన

ఫలితంగానే కట్టబీడి కూలి 11 పైసలనుండి 20 పైసలకు పెరిగింది. గౌడ్‌గారు మాత్రం బాటిల్ ధర తగ్గించలేదు (ఆ సంప్రదింపులకోసమే అన్నలక్కడికి వచ్చారని వినికిడి). రాడికల్స్ వచ్చారు కాబట్టి ఆ ప్రాంతంలో యాంటీ నక్సలైట్‌స్క్వాడ్ (ఎ.ఎన్.ఎస్) కూడా సంచారం మొదలెట్టింది.

ఈ యాంటీ నక్సలైట్‌స్క్వాడ్ మే ఒకటో తారీఖున రోడ్డువతల పొలాల్లోకి వెళ్ళింది రోడ్డుకవతల విశాలమయిన పొలాలున్నాయి. ఆ పొలాల అంచున అడివుంది. పొలాల మధ్యనుండి నాందేడ్ - సికిందరాబాద్ రైల్వేలైను పోతుంది. ఈ రైలుకట్ట కావల ఒక చెట్టుకింద ఐదుగురు అన్నలు ఆ మధ్యాహ్నం విశ్రాంతి తీసుకుంటుండగా సాయుధ పోలీసులు ప్రవేశించారు. అవి రోహిణికార్తె ఎండలు కావడంతో పొలాల్లో రైతులెవ్వరు లేరు. అక్కడి పొలాల్లో ఎక్కువ తక్కువ అన్నీ సన్నకారు రైతులపొలాలే. వాళ్ళు పొలం తాకట్టుపెట్టి బావి తవ్వించుకొని ఇంజను పెయించుకుంటారు. నీళ్ళు పడితే చెరుకు పండించుకొని బతికి బట్టగడ్తారు. నీళ్ళు పడకపోతే పొలం అమ్ముకుని కూలిపనికి పైఫూరుకి పోతారు. మస్కాట్ దుబాయినుండి కామారెడ్డి దాకా ఎక్కడ దొరికితే అక్కడ కూలి పని చేసుకుంటారు. ఇంజనుబావు తొవ్వించాకరువాత అటూ ఇటూ పోవల్సిందేగాని ఉండి నిలదొక్కుకునే అవకాశంలేదు. ఆ పొలాల్లో అరోజు మధ్యాహ్నం ముగ్గురే ఉన్నారు. తమఇంజన్లు రిపేరు చేసుకోవడంకోసం వచ్చిన ఇద్దరు రైతులు, అడివి అంచున పశువులని తోలుకొచ్చిన గొల్లపిల్లవాడు. పోలీసులనుచూసి 'అన్నా పోలీసులు' అని ఈ గొల్లపిల్లవాడు అరిచాడు కాని ప్రయోజనం లేకపోయింది. బావి దగ్గర నీళ్ళు తాగుతున్న అన్నకు వెనకవయిపు నడుంమీద గుండుదెబ్బ తగిలింది. అక్కడే పడిపోయాడు ఇరవయిదేళ్ళ నిండని ఈ అన్నపేరు రెడ్డిపల్లి బాబు, ఊరు అక్కడికి దగ్గరలోనే ఉన్న మూర్యపేట. ఈ మధ్యనే అన్నలలో కలిసాడు. ఈలోగా చెట్టుకింద ఉన్న నల్గురు పరిగెత్తారు. పోలీసులు కాల్పులు చేస్తూనే వాళ్ల వెంబడి పరిగెత్తారు. వంద గజాల దూరంలో మరో అన్న రాజన్న పడిపోయాడు. అయితే మిగతా ముగ్గురిలో ఒక అన్న వెనక్కి తిరిగి కాల్చిన కాల్పులలో ఒక పోలీసు కాలికి గాయంతగిలిపడిపోవడంతో పోలీసులు వెన్నాడటం ఆపేసారు. పడిపోయిన పోలీసును తీసుకొని నల్గురు కామారెడ్డి పోయారు. మిగిలిన ఒక కానిస్టేబుల్ కావలాకి ఉండిపోయాడు.

ఈ కానిస్టేబిల్ ఇదంతా చూస్తున్న రైతు పుండరీకుణ్ణి అక్కడే కూచోబెట్టి బాబు దగ్గరకొచ్చి తన పై గుడ్డతో (యాంటీనక్సలైట్ స్క్వాడ్ అంతా రైతుల వేషంలో ఉన్నారు) చేతులు వెనక్కి విరిచికట్టాడు. దూరంగా బావిదగ్గర తన ఇంజను రిపేరు మానేసి అంతా చూస్తున్న రైతుని మంచినీళ్ళు పట్టుకురమ్మనమని పిలిచాడు. ఆ రైతు వస్తూనే రైతువేషంలో ఉన్న కానిస్టేబిల్‌ని 'అన్నా' అని పలకరించి మంచి నీళ్ళిచ్చాడు. అతను, పుండరీకుడు కలిసి బాబుకి కూడా మంచినీళ్ళు తాగించారు. కాని స్పెషల్ ఇంటరాగేషన్ మొదలెట్టిన తర్వాతగాని అతనెవరో రైతు కర్థం కాలేదు. వందగజాల దూరంలో పడిపోయిన రెండోమనిషి దగ్గరికి వెళ్ళమంటె వెళ్ళనన్నాడు ఇదంతా ఎవరికి చెప్పొద్దని తన్ని తగిలేసాడు. పుండరీకుణ్ణి మాత్రం తన దగ్గరే ఉంచుకున్నాడు. మరికొంత సేపటికి కామారెడ్డి డి.ఎస్.పి నాయకత్వంలో అదనపు పోలీసు బలగాలు వచ్చాయి. పడిపోయిన ఇద్దరికి ప్రాణాపాయమయిన గాయాలేవీ తగల్లేదని తెలిసింతరువాత వాళ్ళని చేతులు వెనక్కి విరిచికట్టి రాత్రంతా చిత్రహింసలుపెట్టి ఉదయం కాల్చి చంపేసారు. అప్పుడే పుండరీకుణ్ణి వదిలిపెట్టారు. మధ్యాహ్నం గవర్నమెంటు డాక్టరొచ్చాడు. అక్కడే శవపరీక్ష చేసాడు. తహసీల్దార్ వచ్చాడు. పంచినామాచేసాడు. చూడటానికి వచ్చిన ప్రజలందర్ని మైలుకట్ట కావలే నిలిపేసారు. వందమంది పోలీసుల సాయుధ పహారాలో శాస్త్రోక్తంగా శవదహనం చేసారు. నెలరోజులు పోయింతరువాత అక్కడ కెళ్ళిన వాళ్ళకి వర్షం కోసం ఎదురుచూస్తున్న పొలాలు, రిపేరయిన ఇంజన్లు, ఇద్దరు రైతులు, పగిలిన కుండముక్కలు, బూడిద, ఆ బూడిదలో సగంకాలిన ఎముకలు ఆ కథకు సాక్ష్యంగా అలాగే మిగిలి ఉన్నాయి. అయితే ఈకథ ఇక్కడితో అంతమవలేదు.

వాళ్ళిద్దరు 'ఎన్‌కౌంటర్'లో మరణించినట్టు మర్నాడు పోలీసులు ప్రకటించారు. ఈ బూటకపు ఎన్‌కౌంటర్లని ఖండిస్తూ రాడికల్స్ జిల్లా అంతా ప్రచారం మొదలెట్టారు. పాలకులు తమకుతాము విధించుకున్న చట్టం ప్రకారం ఇవి రెండు హత్యలు, పడిపోయిన వాళ్ళని పట్టుకొని, చేతులు విరిచికట్టి, ఆ రాత్రంతా హింసించి కాల్చిచంపడం హత్య. ఈ రకం హత్యచేసే అధికారం పోలీసులకి లేదని రాజ్యాంగం రాసింది. శిక్షాస్మృతి నిర్దేశించింది. సమాజం దోపిడీ సమాజం, ఇక్కడిన్యాయం వర్గన్యాయం, చట్టం పాలకవర్గపు పుక్కిటిపురాణం అని రాడికల్స్ రాజకీయ

విశ్వాసం. ఏ సమాజాన్ని నిర్దేశిస్తూ ఈ చట్టాలు వచ్చాయో ఆ సమాజ పునాదులకే ప్రమాదం ఏర్పడినపుడు ఈ రాజ్యాంగం, చట్టం అన్నీచిన్నవిషయాలు. ఆ విష యం తెలిసిన జ్ఞాని కాబట్టి వసంత నాగేశ్వరరావు ఈ మరణాలను పట్టించుకోనవ సరంలేదని పత్రికలకు సలహా ఇచ్చాడు. (ఎవరు ఎప్పుడు ఈ సలహా పాటిస్తారో మనం వేచి చూడాలి) సాధ్యమయితే చట్టబద్ధంగా, అప్పుడు భూమయ్య కిష్టాగౌడ్‌ని చేసినట్టు హత్య చేయవచ్చు. సాధ్యంకాకపోతే జాబిని, రాజనర్సుని చంపినట్టు చట్ట విరుద్ధంగా హత్యచేయవచ్చు. హత్య ముఖ్యం గాని చట్టం ముఖ్యంకాదు. రాడికల్స్ ఎన్నాళ్ళనుండో వ్యవస్థ స్వభావం గురించి ప్రచారంచేస్తున్న ఈ ప్రాథమికసత్యాన్ని తమ త్యాగాలతో రుజువు చేస్తున్నారు.

ఆ ప్రచారంలో భాగంగానే రాడికల్ విద్యార్థి యువజన సంఘాలు మే 15వ తేదీన నిజామాబాద్ జిల్లా బంద్‌కు పిలుపునిచ్చాయి. నిజామాబాద్‌లో బంద్ పూర్తిగానూ, శాంతియుతంగానూ జరిగిందని ఎస్.పి.గారు ఒక ప్రకటన కూడా ఇచ్చాడు. బంద్ కామారెడ్డిలోకూడా విజయవంతమయింది. అయితే ఈ 'శాంతియుత సంపూర్ణ హర్తాళ్' వ్యవహారం అక్కడి పోలీసులకి నచ్చలేదు. వాళ్ళు మధ్యాహ్నం బజారంతా తిరిగి బెదిరించి షాపులు తెరిపించారు. తాళాలు పగులగొట్టి మరీ తెరి పించారు. తెరిచిన షాపులని మళ్ళీ మూయమని కోరుతూ రాడికల్ విద్యార్థి అమ రేందర్ రెడ్డి ఆ బజారంతా తిరిగాడు. మీరు భయపడుతున్నంతకాలం పోలీసులు ఇలాగే జులుం చేస్తారు. భయపడవద్దని చెప్పాడు. అతను బజారంతా సైకిల్‌మీద తిరుగుతుండగానే అక్కడ ఒక వైన్‌షాప్ ఓనరు పోలీసులకి ఫోనుచేసి చెప్పాడు. పోలీసులు వచ్చారు. హోటలుదగ్గర సైకిలాపి ఎవరితోనో మాట్లాడుతున్న అమ రేందర్‌ను కిందకిలాగి కొట్టడం మొదలెట్టారు. అరగంటసేపు అలాగే కొట్టారు. లాఠీలతో కొట్టారు. ఐదారు లాఠీలు విరిగిపోయాయి. తుపాకిమడమలతో కొట్టారు. అక్కడ హోటల్ ఓనరు చూస్తూనే ఉన్నాడు, ఎందుకు ఫోన్‌చేసావా అని విచారిస్తూ వైన్‌షాపాయన చూస్తూనే ఉన్నాడు. రెండువందలమందికి పైగా జనం చూస్తూనే ఉన్నారు. ఇంక ఆపమని అడగటానికి ముందుకెళ్తే వాళ్ళమీద లాఠీలు ఝళిపించారు. ఈ భయంకర దృశ్యంచూసి కంట నీరుపెట్టనివాళ్ళు లేరు. ఆ వూళ్ళో అక్కడే ఒకచోట రాజకీయ నాయకుడున్నాడు. ఆయన ఇరవయి ఏళ్ళపాటు పశ్చిమకోస్తా

తీరంలో స్మగ్లింగ్‌చేసి రాటుతేలాడు. ఆయనకూడా రెండు వారాల తర్వాత ఈ సంఘటన గురించి వివరిస్తూ 'ఇకనే లంబీ జిందగీసే హమ్ బహుత్ కుచ్ దేఖేసాబ్ కభీఐసామార్ నా దేఖా,నహీ, ఐసా లడ్‌కాకో దేఖానహీ' అని కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు ఇన్ని బండబారిన గుండెల్ని కదిలించిన అమరేందర్ మాత్రం దెబ్బలు తింటున్నంతసేపు నిశ్శబ్దంగానే ఉన్నాడు. నోటినుండి శబ్దంలేదు. కంటినుండి నీరులేదు. అక్కడినుండి పోలీసులు అతన్ని దగ్గరలోనే ఉన్న చౌక్ దగ్గరకు తీసుకుపోయారు. సుభాష్ చంద్రబోస్ విగ్రహందగ్గర తలకిందులుగా వేలాడదీసి మళ్ళీ ఒక అరగంటకొట్టారు. అక్కడినుండి పోలీసుస్టేషన్‌కు తీసుకుపోయారు.

పోలీసు లాకప్పులో ఆ రోజు పదకొండుమంది ఉన్నారు. బంద్‌నాడు కోటా పూర్తిచేయడం కోసం ఎవర్ని దొరికితే వాళ్ళని 'రాడికల్స్' అని పేరు చెప్పి తీసుకొచ్చి కొట్టి కొట్లోవేసారు. అందులో ఒక టైలరున్నాడు, ఆర్టీసి కండక్టర్లున్నారు. ఒకళ్ళిద్దరు రైతులున్నారు. చీకటి పడింతర్వాత అమర్‌నాథ్‌ను స్టేషన్‌కు తీసుకొచ్చి మళ్ళీకొట్టారు. ఈలోగా డి.ఎస్.పి వచ్చాడు. ఎక్కువకొట్టకండి చచ్చిపోతాడని పోలీసులకి హితవు చెప్పాడు. ఆయన ఉన్నంతసేపు ఆపి, వెళ్ళిపోయింతర్వాత మళ్ళీ కొట్టడం అరంభించారు. ఈ హింసాకాండ మొదలయిన తర్వాత మొట్టమొదటిసారిగా రాత్రి పదకొండు గంటల ప్రాంతంలో అమర్‌నాథ్ నోటినుండి అమ్మా అన్న శబ్దం వెలువడింది. ఆ జీవి ఆఖరిమాట అదే.

మరోగంటకు పోలీసులు అతని శవాన్ని హాస్పటల్‌కు చేర్చారు. బంద్ ఆర్గనైజ్ చేస్తుంటే కామారెడ్డి ప్రజలు అతన్ని పట్టుకొని కొట్టడంవల్ల దెబ్బలుతగిలి మరణించాడని పత్రికా ప్రకటన ఇచ్చారు. పోలీసులే అతని శవాన్ని దహనంచేసారు పద్దెనిమిదేళ్లక్రితం నల్గొండజిల్లా తుంగతుర్తిలో ఒక రైతు కుటుంబంలో పుట్టిన అమరేందర్‌రెడ్డి జీవితం కామారెడ్డి పోలీసు లాకప్పులో ముగిసింది.

అయితే ఈ కథ ఇక్కడితో ముగియలేదు. ఏళ్ల తరబడి పెరగకుండా నిలిచిన కూలిరేటు పెరిగింది. శ్రమకు తగ్గ ఫలితం సాధించుకునేమార్గం ప్రజలకు తెలిసివస్తోంది. చెరుకు ఉత్పత్తిని పెంచడానికి ఇంజను బావులు వేయిస్తే రైతులు అన్నలకి మంచినీళ్ళిచ్చి వాళ్ళ జీవన్మరణాలకి సాక్షీభూతాలుగా నిలిచిపోతున్నారు. సహ

కార సంఘాలలో సమిష్టి ఇచ్ఛ, స్వేచ్ఛా పరోక్షంగానయినా ప్రకాశిస్తున్నాయి. కూలిరేటు పెరగకుండా ఉండాలంటే, సహకారసంఘాలు ఫ్యూడల్ అధికారానికే పరిమితమయి ఉండిపోవాలంటే రైతులు ఇక్కడే ఉండి అణిగిమణిగి పడిఉండాలంటే–ఆర్థికాభివృద్ధి తన స్వభావాన్ని తాను నిలుపుకోవాలంటే సాయుధ పోలీసుల బలగాలు అవసరమవుతున్నాయి. భౌతిక ఉత్పత్తి క్రమంలో వస్తున్న ఈ సంక్షోభం రాజ్యాంగానికి, రాజకీయ నిర్మాణరూపాలకి, చట్టాలకి కాలదోషం పట్టిస్తోంది. అందుకే మారుతున్న సమాజంలో ఈ మరణాలు మైలురాళ్ళు మాత్రమే. ఈ మలుపు తిరిగిన తర్వాత విప్లవ పోరాటాన్ని నడిపించటానికే మే 15వ తేది అర్ధరాత్రి కామారెడ్డి పోలీసు లాకప్పులో అమరేందర్ రెడ్డి జీవితం ఆరంభమయింది.

o—o

విశ్లేషణ :

# 'అతడుం - ఆమెం' - జాతీయోద్యమం

కె. బాలగోపాల్

ఒక సామాజిక విషయాన్ని అర్థంచేసుకోవడానికి అది సజీవంగా ఉంటే చాలా సౌకర్యం. లేకపోతే దాన్ని గురించిన అభిప్రాయాలు మాత్రమే మనకు దొరుకుతాయి. ఈ అభిప్రాయాలు రకరకాల అవసరాల కోసం, రకరకాల ఒత్తిడులతో, రకరకాల జ్ఞాపకాలతో ఏర్పరచుకునేవి కావడంవల్ల అవి వాస్తవానికి సాధారణంగా ఎంతో కొంత వక్రీకరణలే కాగలవు. అందుకే చరిత్ర రచన అంత కష్టం.

మన జాతీయోద్యమాన్ని తీసుకోండి. జాతీయోద్యమం అనగానే మన కివ్వాళ కాంగ్రెస్ పార్టీ గుర్తుకొస్తుంది. కాని ఆనాడు కాంగ్రెస్ పార్టీ నడిపిన ఉద్యమమే జాతీయోద్యమమని ప్రజలంతా అనుకోలేదు. ఆ అభిప్రాయాన్ని తరువాతి కాలంలో మనకు బలవంతంగా కలిగించారు. కాంగ్రేసేతర పార్టీలూ సంస్థలూ ఉద్యమాలూ చేసిన కృషిని 'విజేతల చరిత్ర 'మింగేసింది.

పోనీ జాతీయోద్యమంలో కాంగ్రెస్ పాత్రను తీసుకోండి. దీన్ని ఇవ్వాళ అర్థం చేసుకోవడం చాలా కష్టమయిపోయింది. ఆనాడు ప్రజలలో వివిధ వర్గాలు కాంగ్రెస్‌ను గురించి, గాంధీని గురించి, నిజంగా ఏమనుకున్నారో, ఏ వైఖరితో వాళ్ల ఉద్యమాలలో పాల్గొన్నారో, మనకివ్వాళ అంతు చిక్కడం సమస్య అయింది. దేశమంతా ఉద్యమ ఉత్సాహంతో అట్టుడికిపోయి (నిజంగా అట్టుడికి పోయారో లేదో– ఇదిగూడ మనకు కాంగ్రెస్ వారు చెప్పిన చరిత్రే) ప్రజలు ఇల్లూ వాకిలి సంసారం వదిలిపెట్టి బయటకు వస్తున్న సందర్భంలో చౌరీచౌరాలో 'దౌర్జన్యం' జరిగిందని ఉద్యమాన్ని గాంధీ విరమించుకున్నప్పుడు జనం నిజంగా ఏమనుకున్నారు? మహాత్ముడనుకున్నారా, వెర్రివాడనుకున్నారా, బహుశా బ్రిటిష్ ఏజెంటేమోనన్న అనుమానం గూడ కలిగిందా ? (ఎవ్వరికీ ఈ అనుమానం కలగలేదంటే నమ్మడం కష్టం). కొన్నేళ్ల తరువాత స్వరాజ్యం కోసం మళ్లీ ఉద్యమాన్ని ఆహ్వానించి ఏం చేయమంటాడో అని అందరూ ఆతృతతో ఎదురు చూస్తూ వుండగా ఉప్పు తయారు చేయమని గాంధీ అన్నప్పుడు - అప్పుడు జనం ఏమనుకున్నారు ? రాజకీయ వ్యూహాన్ని ఎత్తుగడలనూ రూపొందించవలసిన సమయంలో రాట్నం వడకమని ఆదేశించినప్పుడు, జనాన్ని పోనీండి కాంగ్రెస్ కార్యకర్తలు సహితం విసుక్కోలేదూ?

మనకు తెలీదు. 1947 తరువాత రూపొందిన అధికార అభిప్రాయాలు మాత్రమే మనకు తెలుసు. 1947 తరువాత కాంగ్రెస్ వారి జాతీయోద్యమం వీధుల నుండి పాఠశాలలలోకివచ్చింది. పాఠ్యపుస్తకాలలో గ్రంథస్తమై కూర్చుంది. అంతకు ముందు ఒక్కొక్క సమయంలో కాంగ్రెస్ తీసుకున్న నిర్ణయం, అవలంబించిన వ్యూహం, ఆనాడు ప్రజల కళ్లకు ఏవిధంగా కనబడ్డాయోగాని ఈ పాఠ్య పుస్తకాలలో అవి చాలా అనివార్యమయిన నిర్ణయాలుగా వర్ణించబడతాయి. వాటి విజ్ఞతను ఆనాడు ప్రజలలో కొందరయినా ప్రశ్నించారేమోనన్న అనుమానం మనకు రానివ్వరు. ఎంతో ముందు చూపుతో, తరచి తూచి తీసుకొన్న నిర్ణయాలుగా వర్ణింపబడతాయి. ఆ నిర్ణయాలే చరిత్రను నడుపుతాయి.

రానురాను, పాత కాంగ్రెస్ నాయకులు గతించే కొద్దీ ఈ పురాణం కరిగి పోవలసింది పోయి మరింత కరడుగడుతోంది. నిన్నటి వరకు కేవలం జాతిపిత అయిన గాంధీ ఇప్పుడొక ప్రవక్తగాను, సామాజిక విప్లవతత్వవేత్తగాను, ఋషిగాను మారుతున్నాడు. ఈ పరిణామానికి కర్తలు పాత గాంధేయులు కారు. కృపలాని కాదు, జయప్రకాష్ కాదు, వినోబాకాదు, ప్రకృతి చికిత్సలో నిపుణులయిన మొరార్జీ గాని ప్రభుదాస్ పట్వారిగాని కారు. ఈ మార్పును సాధిస్తున్నది కొత్తతరానికి చెందిన కొత్త గాంధేయులు. వీళ్లలో ప్రముఖులు అరుణ్ శౌరి, ఆశీశ్ నంది, క్లాడ్ ఆల్వారస్. ( గాంధీగారి మనవలలో ఒకడయిన రాజ్‌మోహన్ గాంధిని గూడ వీళ్లతో చేర్చవచ్చును గాని, పితరులను దైవసమానులుగా భావించడం భారతీయ సంప్రదాయమే కాబట్టి ఇతన్ని గూడ ఈ కోవలో చేరిస్తే ఇక వీళ్ల రేపు పిండం గూడ పెట్టొద్దంటారని దేశభక్తులంతా మనమీద విరుచుకు పడతారు కాబట్టి పోనిద్దాం. వీళ్లకూ పాత గాంధేయులకూ రెండు మూడు తేడాలున్నాయి. రూపం మేరకు తీసుకుంటే వీళ్లు ఖద్దరు మనుషులు కారు. ఇంగ్లీష్ చదువులు చాలా చదివి ఎవరికీ అర్థం కాకుండ రాయగల సామర్థ్యం గలవాళ్లు. విదేశాలలో ఘరానా చదువులు/ఉద్యోగాలు నెరపి తరచు విలాయతీ పోయి వస్తూంటారు. వస్తువులోని తేడా చెప్పాలంటే వీళ్లు ఒక రకంగా పాత తరంకంటే కరడు గట్టిన గాంధేయులు. పాత తరానికి గాంధిజం, మార్క్సిజం అనేది లిబరలిజం మొదలయిన రాజకీయ దృక్పథాలకు ఒకానొక ప్రత్యామ్నాయం మాత్రమే. ఈ కొత్తతరం వారికి అది ఏకైక అఖండమయిన 'భారతీయ' దృక్పథం. అది ఆధ్యాత్మికం, సాత్వికం, మానవీయం, వగైరా వగైరా.

అప్రాచ్యదృక్పథాల (మార్క్సిజం యుక్తంగా) కోణం నుండి చూస్తే అది అర్థమే కాదు. అట్లా చూడటమే అపచారం. ఎందుకంటే పాశ్చాత్య ప్రాచ్య దృక్పథాల పునాదే వేరు. ఒకటి భౌతికమయితే రెండవది ఆధ్యాత్మికం,ఒకటి పాదార్థికమయితే రెండవది పారమార్థికం. ఈ విధంగా గాంధిజం ఆధునిక దృక్పథాల విమర్శకు అతీతంగా నిలబెట్టబడుతోంది. త్వరలో అది అపౌరుషేయంగా ప్రకటింపబడినా ఆశ్చర్యం లేదు.

తాత్విక స్థాయిలో మాత్రమే కాదు. జాతీయోద్యమంలో కాంగ్రెస్ పాత్ర గూడ రోజురోజుకూ మరింత వీరోచితంగా చిత్రీకరించ బడుతోంది. చరిత్ర పునరావలోకనంలో కాంగ్రెస్ నాయకుల గతకాలపు పరాక్రమం దినదినప్రవర్థమానమవుతోంది. ఆమధ్య అరుణ్‌శౌరి కమ్యూనిస్టుల 'విద్రోహాన్ని' దూషిస్తూ ఇల్లస్ట్రేటివ్ వీక్లీలో రాసిన వ్యాసంలో, క్విట్ ఇండియా ఉద్యమంలో కాంగ్రెస్ నాయకులు చేతులు కాళ్లూ విరగ్గొట్టుకొని తలలు పగలగొట్టుకొని దేశమాత కోసం రక్తతర్పణం పెట్టిన వైనాన్ని కొనియాడటం చదివితే చరిత్ర తెలిసిన వాళ్లెవరయినా నోరు నొక్కుకోక తప్పదు.

అందుకనే ఇవ్వాళ జాతీయోద్యమంలో కాంగ్రెస్ స్థానాన్ని స్పష్టంగా అర్థం చేసుకోవాల్సిన అవసరం వుంది. ఈ అవసరం ఇన్నేళ్లయినా సమగ్రంగా తీరక పోవడం విచారకరం. 1952 తరువాత కమ్యూనిస్టు పార్టీ తన వ్యూహాన్ని మార్చుకోవడంతో బాటు అన్నిరకాల మర్యాదస్తుల లక్షణాలనూ ఒంట బట్టించుకుంది. గాంధీనీ కాంగ్రెస్‌నూ 'బాధ్యతారహితంగా' తిట్టడం మానేసింది. కాంగ్రెస్ అగ్రగామి జాతీయశక్తి అయింది. గాంధీ సామాజికంగా తిరోగామి దృక్పథం గలవాడయినప్పటికీ ప్రజలనాడి ఎరిగి జాతీయోద్యమం నడిపిన మహాత్ముడయ్యాడు. బిపిన్ చంద్ర వంటి మేధావులకయితే, కాంగ్రెస్ నాయకులదే సరయిన చైతన్యం, తక్కినదంతా తప్పుడు చైతన్యం.

అయితే మార్క్సిస్టు పరిశీలకులలో విమర్శనాత్మకంగా కాంగ్రెస్‌ను అంచనా వేసినవారు లేకపోలేదు. అందులో నంబూద్రిపాద్ నుండి సుమిత్ సర్కార్ వరకు చాలా మందే వున్నారు. జాతీయోద్యమంలో గాంధీ అవలంబించిన వ్యూహాన్ని అర్థం చేసుకోవడానికి వీళ్లొక సిద్ధాంత చట్రాన్ని ప్రతిపాదించారు. బ్రిటిష్ వాళ్లనుండి

రాయితీలు కోరినప్పుడల్లా ఒక ఒత్తిడిగా గాంధీ ప్రజా ఉద్యమాలను వాడుకున్నాడు. అయితే ఆ ఉద్యమం వర్గపోరాట రూపం తీసుకోకుండ చూడడం కోసం మౌలిక మయిన డిమాండ్లు పెట్టకుండ, ఉప్పుతయారుచేయడం, సారా దుకాణాలు పికెటింగ్ చేయడం, సత్యాగ్రహం మొదలయిన కార్యక్రమాలు తీసుకునేవాడు. అప్పటికే ఉద్యమం చేయిదాటిపోయేటట్టు కనిపిస్తే, అటు బ్రిటిష్ ప్రభుత్వం ఇటు కాంగ్రెస్ పార్టీ ఇద్దరూ రాజీకి రావడం, గాంధీ ఉద్యమాన్ని విరమించడం, జరిగేది.

ఈ సిద్ధాంత చట్రం కాంగ్రెస్ యొక్క జాతీయోద్యమ వ్యూహాన్నీ, తద్వారా సూచన ప్రాయంగా కాంగ్రెస్ వర్గ స్వభావాన్ని వివరించడానికి బాగా పనికి వస్తుంది. అయితే కాంగ్రెస్ పార్టీ యొక్క సామాజిక స్వభావాన్ని సమగ్రంగా తెలుసుకోవ డానికి ఇది చాలదు. ఈ చరిత్రను ప్రజలజ్ఞాపకాల ఆధారంగా పునర్నిర్మించే ప్రయ త్నం బీహార్, ఉత్తర ప్రదేశ్ రాష్ట్రాలకు సంబంధించి కొంత ఇప్పుడిప్పుడే జరుగు తోంది. దీనికి Subaltern History అని, Hitsory from below అని కొత్త కొత్త పేర్లు పెట్టి గందరగోళం చేస్తున్నారు గాని ఈ పండిత వ్యామోహాన్ని క్షమిస్తే వాళ్ళ పరిశోధన ఉపయోగకరమయినదే. మన దగ్గర మాత్రం అటువంటి ప్రయత్నం ఇంకా మొదలు కానేలేదు. కాని జాతీయోద్యమ కాలానికి సంబంధించిన నవలలోను, కథలలోను ఇతర రచనలలోను ఆ చరిత్ర శకలాలు దొరుకుతాయి. వుప్పల లక్ష్మణరావుగారి 'అతడు-ఆమె'లో ఈ శకలాలను అన్వేషించడం ఈ వ్యాసం ఉద్దేశ్యం.

*   *   *

శాంతంకూ శాస్త్రికీ పెళ్ళి ఎప్పుడయింది? లక్ష్మణరావుగారు ఎక్కడా చెప్పలేదు గాని, నవలలో జాతీయోద్యమం ప్రస్తావనను బట్టి ముందుకూ వెనక్కీ లెక్కలు కడితే 1926 అనుకుంటాను.

అప్పటికి గాంధీగారి మొదటి సత్యాగ్రహ ఉద్యమం అయిపోయింది. చౌరీ చౌరాకు భయపడి ఆయనగారు దాన్ని విరమించేసారు. ఖిలాఫత్ వచ్చింది, పోయింది. హిందూ ముస్లిం భాయిభాయి పోయి మత విద్వేషాలు రెచ్చగొట్టడం మళ్లీ మొదల యింది. సంసారాలు వదిలి ఉద్యమంలోనికి దూకిన వాళ్ళందరినీ గాంధీ రాట్నం తిప్పమని, హరిజన సేవ చేయమని, మత సామరస్యం బోధించమని తిరిగి పంపాడు.

కొందరు ఖద్దరుధారులయ్యారు, కొందరు మొదటి రుచితోనే కాంగ్రెస్ సత్తా తెలుసు కొని అన్యమార్గాల అన్వేషణలో పడ్డారు. కాంగ్రెస్ వారి జాతీయోద్యమం స్తబ్ధంగా వున్న కాలం యిది. మళ్ళీ సైమన్ కమీషన్ వచ్చి అందులో తమకు ప్రాతినిధ్యం ఇవ్వలేదని అలిగేదాకా అందులో మళ్ళీ కదలిక రాదు.

'అతడు-ఆమె' లో గూడ రాజకీయాల ప్రస్తావన మొదటి 100 పేజీలలో లేదు. బారిస్టర్ భర్త, లెక్చరర్ భార్య, రెండుచేతుల సంపాదన రెండుచేతుల ఖర్చు, కొత్త దాంపత్యం కొత్త జీవితం, వ్యాపార వకాల్తీకి వకాలత్, వ్యాపారానికి సహజ మయిన ఆటుపోట్లు, పెద్ద యిల్లా పెద్ద కారూ అమ్మి చిన్న ఇంట్లో అద్దెకు దిగడం, అత్తగారి కినుక పుణ్యాన కొద్దికాలం ఎడబాటు, మళ్ళీ లక్ష్మీదేవి కొందరు కోర్టు పక్షులయిన జమీందార్ల రూపంలో కటాక్షించి తిరిగి పెద్దయిల్లూ నౌకర్లూ తదితర భోగాలభాగ్యం — లక్ష్మణరావుగారి శిల్పం కోసం, ఉత్తరాంధ్ర నుడికారంలో చేయి తిరిగిన భాషకోసం కాకపోతే ఈ కథ చదవడం దండుగే.

ఉన్నట్టుండి పెళ్ళయిన నాలుగేళ్ళకి, ఉప్పు సత్యాగ్రహం రోజులలో, శాంతమ్మకు రాజకీయం అంటుకుంది. దాంపత్య జీవితపు కొత్తదనం చెరిగిపోయి భర్త నుండి మానసికంగా దూరం కావడంవల్ల తనకు రాజకీయాలపైన ఆసక్తి పెరుగుతోందని శాంతమ్మ తన సహజమైన భావవాద ధోరణిలో అనుకుంటుంది. ఆసక్తి పెరగడానికి ఒక రాజకీయమే లేకుంటే ఆ వైవాహిక వైమనస్యం ఎటుపోయి ఉండేదో.

నిజానికి ఈ మార్పు చాలా ఆసక్తికరమయినది. మనం బాల్యం గడిచి పెరిగే క్రమంలో సామాజిక నైతిక విలువలనూ ప్రమాణాలనూ అంతర్గతం చేసుకుంటాం. ఆ ప్రమాణాలకు సంబంధించిన స్పృహను అంతరాత్మ అంటాం. శాస్త్రికి ఈ అంత రాత్మలేదు. అది మినహా అతను మంచివాడే. బుద్ధి పూర్వకంగా ఒకరికి హానిచేయడు. తన స్వార్థాన్ని గురించి ఆలోచించే వ్యవధి లేకపోతే మంచిగూడ చేస్తాడు. (సము ద్రంలో కొట్టుకుపోతున్న కుర్రవాడి ప్రాణాన్ని తాను సముద్రంలోకి దూకికాపాడుతాడు) అయితే అతనికి నైతిక స్పృహలేదు. శాస్త్రిలోలేని ఈ అంతరాత్మ శాంతమ్మ. ఆమె ఒక వ్యక్తికాదు. ఆమె మధ్య తరగతియొక్క ఆత్మాధర్మం (ego-ideal అని అడ్లర్ అంటాడు). తెలివి, నీతి, ఓర్పు, దయ, క్షమ, జాలి, వివేచన, ఇవన్నీ ఆమెలో వున్నాయి. ఇవన్నీకాక అన్నింటినీ మించిన మధ్యతరగతి సద్గుణం ఆమెలో వుంది—

ఈ గుణాలు లేనివాళ్ళను చూసి కోపం చేసుకోకుండ అసహ్యించుకోకుండ ముచ్చటగా గర్వపడుతుంది, గొప్పవాళ్ళకు సహజమయిన వాత్సల్యాన్ని ప్రదర్శిస్తుంది. శాస్త్రిలో వున్న స్వార్థానికీ, లేని ఈ అంతఃకరణకూ మధ్య ఘర్షణ రావడం చాలా సహజం. అది నిర్దిష్ట రాజకీయ పరిస్థితులలో నిర్దిష్ట రాజకీయ రూపం తీసుకోవడం గూడ అంతే సహజం. అంతకు ముందే ఇంట్లో పనివాళ్ళ విషయంలో శాంతమ్మ 'సత్యకాలపు' మనిషిలాగ ప్రవర్తించడం చూసి శాస్త్రి ఆమెను మందలించడం, 'వాళ్ళకూడా మనుషులే కదా' అని వాదిస్తూగూడ అతని లౌక్యానికి దారివిడిచి శాంతం ఏక సమయంలో తన మంచి తనానికీ అతని గడుసుదనానికీ గర్వించడం, జరుగుతుంది.

ఇంతలో ఆమెకు రాజకీయంఅంటుకుంది. అప్పటికే పదేళ్ళ ముందు జవహర్ లాల్‌నెహ్రూ అవధ్ ప్రాంతపు గ్రామాలు తిరిగి భారతదేశాన్ని 'డిస్కవర్' చేసిన వైనం స్వతంత్ర భారతంలో స్కూలుకు వెళ్ళిన ప్రతీ కుర్రవాడికీ తెలుసు. ఎందుకంటే పుట్టిపెరిగిన దేశాన్ని ఇంత లేటు వయసులో డిస్కవర్ చేసినందుకు సిగ్గు సహితం చెందకుండ ఆయన దాన్ని తన రచనలలో గర్వంగా ప్రకటించుకున్నాడు. శాంతం గూడ భర్తతో పుదుచ్చేరి పిక్నిక్‌వెళ్ళి అక్కడ ఒక బట్టల మిల్లులో కార్మికుల దుస్థితిని చూసి భారతదేశాన్ని డిస్కవర్ చేసింది. అప్పటినుండి శాంతంకు, శాస్త్రి మాటలలో 'సోషలిస్టు గాలి చల్లింది.' మానసికంగా ఆమెకు సోషలిస్టుగాలి తగిలిందిగాని ఆచరణలో ఆమె గాంధీని దాటిపోలేదు. తన ఖరీదయిన బట్టలు తగలబెట్టి ఖద్దరు ధరించడం మొదలు పెడుతుంది. దీనివల్ల ప్రయోజనం ఎంతవుందో ఆమెకు మొదటి నుండీఅనుమానమే. 'ఖద్దరు వాడకం బాగానేవుంది. చాలామంది కడుతున్నారు....ఆరు నెలలయి నియమంగా రాట్నం వడుకుతున్నాను. కాని స్వరాజ్యం సూచనలు కనిపించడంలేదు. ఉప్పు వండినంత మాత్రాన బ్రిటిష్‌వాడు భయపడి వెళ్ళిపోతాడా అని ప్రపంచంలో అందరూ నవ్వుకుంటున్నారు' అని తన డైరీలో రాసుకుంటుంది. గమనించవలసిన విషయం ఏమిటంటే ఈ సరికి శాస్త్రి ఘరానా బారిష్టరు. అతని క్లయింట్లు జమిందార్లు. నడిపే వ్యాజ్యాలు రైతులకు వ్యతిరేకంగా. ఆదాయం వేలల్లో, అచిర కాలంలో లక్షల్లో. చూపులు అడ్వకేట్ జనరల్ గిరీమీద, కొంచెం ఆశపెరిగిన పూట వైస్‌రాయి కౌన్సిల్‌మీద.

అప్పటి నుండి ఇక శాంతం క్రమంగా కాంగ్రెస్‌లోకి, శాస్త్రి ఆమె వెనుక

ఒక్కడుగు వెనక్కీ రెండడుగులు ముందుకూ వేస్తూ వెనక చూపులు చూస్తూ ముందుకు ప్రయాణం. శాస్త్రికి బ్రిటిష్‌వాళ్ళు దేశంలో ఉండాలనిగాని పోవాలనిగాని ఏమీలేదు. అతను దేశాభిమానహీనుడు కాడు, ఆవర్శాలకు అతీతుడు మాత్రమే. బ్రిటిష్ వాళ్ళు ఉంటే తాను అడ్వకేట్ జనరల్ కావాలి, పోతే కాంగ్రెస్‌వారి స్వరాజ్యంలో సుప్రీం కోర్టు జడ్జి కావాలి. రెంటికీ చెడకుండ సాముచేయడం ఎలాగన్నదే అతని బాధ. రోడ్లో కాంగ్రెస్ కుర్రవాళ్ళు చందా అడిగితే తాను ఇవ్వడు, శాంతం అనాలోచితంగా 25 రూపాయిలిచ్చి రసీదు పుచ్చుకుంటే ఆమె పేరునుబట్టి తన భార్య అని గుర్తు పడతారేమోనని భయపడతాడు, కాని రసీదు మాత్రం జాగ్రత్త చేయమంటాడు—స్వరాజ్యం వస్తేగిస్తే సర్టిఫికేట్ కావాలి గదా.

ఈభార్యాభర్తలిద్దరూ కాంగ్రెస్‌పార్టీ సామాజిక స్వభావానికి రెండు పార్శ్వాలు. కార్మికులు, కూలీలు, సామాన్య రైతులు, తమ సంఘాల ద్వారానూ ఏ సంఘాలూ లేకుండానూ పోరాటంచేసి జాతీయోద్యమంలో పాల్గొన్నారు. వేతనాలకోసం పోరాటాలు చేసారు, శిస్తు భారానికీ భూస్వామ్యానికీ వ్యతిరేకంగా పోరాటాలు చేసారు. కాంగ్రెస్ సత్యాగ్రహాలలో గూడ ఒకరిద్దరు భాగం పంచుకున్నారు. కాని వాళ్లెన్నడూ ఒక వర్గంగా 'కాంగ్రెస్ మనుషులు' కాదు. కాంగ్రెస్ మనుషులు రెండు జాతులవాళ్లు. ఒకటి, రోజురోజుకూ విస్తరిస్తున్న బూర్జువా-భూస్వామ్య వర్గం. రెండు మధ్య తరగతి. ధనికవర్గం కాంగ్రెస్‌ను నడిపింది. కాంగ్రెస్‌ను పోషించింది. కాంగ్రెస్ నాయకత్వాన్ని తానే నిర్వహించి కొంత, తన గుప్పిట్లో పెట్టుకొని కొంత తన అవసరాలకు అనుకూలంగా ఆ పార్టీని మలిచింది. మధ్య తరగతి కాంగ్రెస్‌కు వేలాది సత్యాగ్రహులను, స్థానిక నేతలను. లాఠీదెబ్బలు తినే వాలంటీర్లను ఇవ్వడమేకాక, తన నైతిక ప్రమాణాలను కాంగ్రెస్‌కు అరువిచ్చింది. రుగ్వేదంలోని పురుసూక్తాన్ని అనుకరించాలంటే కాంగ్రెస్ అనే బ్రహ్మకు ధనికులు వెన్నుముక, గుండె, మెదడు అయితే పెటీ బూర్జువావర్గం కాళ్ళు, పాదాలు, అంతరాత్మ.

అట్లాగంటే ధనికవర్గం మొత్తంగా కాంగ్రెస్‌ను సమర్ధించిందని కాదు. బ్రిటిష్ వాళ్ళనుండి అధికారాన్ని తమకు బదలాయించుకొని తామే రాజ్యం చేయడంవల్ల లాభం వుందని వాళ్ళందరూ గుర్తించినా, అది అయ్యేపని అన్న నమ్మకంవున్న బిర్లాల వంటి వాళ్ళే కాంగ్రెస్‌ను పూర్తిగా సమర్ధించారు. అది అయ్యేదోకాదో, పరాయి పాలన అయితే మాత్రం వ్యాపారానికి చేదా అనుకున్న వాళ్ళు దూరంగా వున్నారు, మరొక

కోణం నుండి చూస్తే, ఈ ఉద్యమాలు మొదలుపెడితే అది బోల్షెవిజానికి (ఆ రోజులలో కమ్యూనిజాన్ని ఇంకా బోల్షెవిజం అనేవారు) దారి తీస్తుందని భయపడి కొందరు దూరంవుంటే, బోల్షెవిజం నుండి దేశాన్ని కాంగ్రెసే రక్షించగలదని ఇతరులు దగ్గరయ్యారు. వాస్తవానికి ఈ రెండు వైఖరుల మధ్య స్పష్టమయిన విభజనరేఖలేదు. ధనికవర్గంలో అందరిలోనూ ఈ రెండు వత్తిడులు వున్నాయి. అందుకే వాళ్ళకు కాంగ్రెస్ అంటే ఏక సమయంలో భయం, కోపం, ఆప్యాయత, ఆదరణ. క్రమంగా స్వరాజ్యం సంభవం అనిపించిన తరువాతే వాళ్ళు పూర్తిగా కాంగ్రెస్ మనుషులయ్యారు,

ఆర్థికంగా మాత్రమేగాక వ్యక్తిత్వరీత్యాగూడ శాస్త్రి ఈ కోవకు చెందినవాడే. ఉప్పు సత్యాగ్రహం రోజులలో శాంతంలో కొత్తగా చిగురిస్తున్న భావాలను వేళాకోళం చేసి, ఆమె ఖద్దరు ధరిస్తే 'ఇప్పుడే తొందరే మొచ్చింది. నేను రెండు మూడేళ్ళు అడ్వకేట్ జనరల్ గిరీచేసి పాపాయికి మంచి సంబంధం చూసి . . . రెండు లకారాలు సంపాదించిన పిదప - నేను గూడ జాతీయవాదినే కదా - ఇద్దరం ఒకేసారి దిగుదాం' అని కోర్టువారిని వాయిదా అడిగినట్లు అడిగి, రెండేళ్ళ తరువాత రౌండ్ టేబిల్ సమావేశం విఫలమయి విరమించుకున్నప్పుడు 'అసలు మొదలు పెట్టడమే తెలివి తక్కువ' అనుకున్ననాటినుండి, మరొక మూడేళ్ళు గడిచి 1936 ప్రొవిన్షియల్ అసెంబ్లీ ఎన్నికలు వచ్చేసరికి ప్లేటు పూర్తిగా ఫిరాయించి తనకు కాంగ్రెస్ టిక్కెట్ సంపాదించి పెట్టమని శాంతంను అడిగినదాకా, శాస్త్రి విశ్వాసాలలో ఎటువంటి మార్పులేదు. పరిస్థితులలోనూ అవకాశాలలోనూ మాత్రమే మార్పు వుంది. ఇదే శాంతంకు కోపం తెప్పిస్తుంది. నీతిని ఆచరించకపోతే మధ్యతరగతి మనస్తత్వం సులువుగా క్షమించేస్తుంది, కాని నీతిని ప్రదర్శించకపోతే క్షమించదు. శాస్త్రి ఆదర్శాలను ఆచరించడు, ప్రదర్శించడు.

దీనితోబాటు శాంతంలో ప్రజాస్వామిక భావాలు ప్రబలేకొద్దీ ఆమెకూ శాస్త్రికీ అభిప్రాయ భేదాలు పెరుగుతాయి. ఈ ప్రజాస్వామిక భావాలు గాంధిజంనుండి పుట్టినవి కావు.

చుట్టూవున్న రైతాంగ పోరాటాలు, కార్మికపోరాటాలనుండి, సోషలిస్టు కమ్యూనిస్టు భావాలనుండి పుట్టినవి. ఉదాహరణకు రైతులను బేదఖల్‌చేసి హత్యలు

చేయించిన జమీందార్ల వ్యాజ్యం శాస్త్రి చేపట్టినప్పుడు కాంతంకు కోపం వస్తుంది. గాంధీకి కోపం వచ్చి ఉండేదా? సత్యాగ్రహ ఉద్యమంలో రైతులు జమీందార్లకు ఎటువంటి ఇబ్బందీ కలిగించకూడదని ఆదేశించినవాడు కాడూ? పైగా గాంధీ నమ్మిన వర్ణాశ్రమ ధర్మం నిర్దేశించే నీతిలో ఒక వకీలు జమీందార్ల వ్యాజ్యం చేసినా రైతుల వ్యాజ్యం చేసినా అది అతని ధర్మనిర్వహణే. అందులో న్యాయాన్యాయాల ప్రసక్తి పాశ్చాత్య సోషలిస్టు గాలి తగిలిన కాంతం లాంటి వాళ్ళు తెస్తున్నారుగాని ఆ మీమాంస 'భారతీయం' కాదు. దక్షిణ ఆఫ్రికా కాలంనుండి గూడ ప్రజా ఉద్యమాలు అహింసాత్మకంగా నడవాలని పట్టుబట్టిన గాంధీ మొదటి ప్రపంచ యుద్ధంలో బేషరతుగాను, రెండవ ప్రపంచ యుద్ధంలో 'స్వరాజ్యం' అనే షరతుతోనూ బ్రిటిష్ యుద్ధ ప్రయత్నాలకు తన మద్దతు ఇవ్వడానికి సిద్ధపడటం చాలామంది పరిశీలకులకు ఆశ్చర్యం కలిగించింది. ఇందులో ద్వంద్వ ప్రమాణాలు సహితం కనబడ్డాయి. కాని అటువంటిదేం లేదు. ఇవన్నీ గాంధీని పాశ్చాత్య దృక్పథంతో చూడటం వల్ల వచ్చిన కళంకాలు. అనాదిగా భారత సాంప్రదాయంలో రాజులు యుద్ధం చేయడం హింస అనిపించుకోలేదు, అది రాజుల ధర్మం. అహింస ప్రజల ధర్మం మాత్రమే.

ఎలాగయితేనేం, అది గాంధిజంగాని, సోషలిజంగాని, శాస్త్రి గాభరా గాభరా మాటల్లో బోల్షివిజంగాని, కాంతం మానసికంగా శాస్త్రికి దూరం అయింది. చివరికి ఒకనాటికి సహించలేక 'కొన్నాళ్ళపాటు - కొంత దూరంపాటు' చీలిపోయి ఎవరిదారిన వారు పోవాలని నిర్ణయించుకుంటుంది. నిర్ణయించుకొని తన కుమార్తె లక్ష్మిని, పెంపుడు కుమార్తె సుభనూ తీసుకొని దేశం చూడడానికి బయలుదేరుతుంది. అయితే ఆమె దేశం చూడడం గూడ వట్టి దేశాటనం కాదు. సినిమా బాక్సాఫీస్ ఫార్ములా పూర్తి కావాలంటే కాశ్మీర్ లోయలో, సరస్సులో చూపించక తప్పనట్టు జాతీయోద్యమ నవల లాక్షణికంగా పరిపూర్ణం కావాలంటే నాయకుడుగాని నాయికగాని గతకాలపు ఘనతను తలపింపజేస్తూ చరిత్రాత్మకమయిన స్థలాలను దర్శించి 'ఏవి తల్లీ....' అని కవిత్వం వల్లించక తప్పదు. మన జాతీయోద్యమానికీ జ్యాగ్రఫీకీ విచిత్రమైన సంబంధం వుంది. అన్ని దేశాలలోనూ పాడుబడ్డ కోటలూ, పాతకాలపు గుళ్ళూ వుంటాయిగాని అవి అన్ని దేశాలలోనూ జాతీయ చైతన్యానికి ఆలయాలు కావు. మన దేశంలో మాత్రం జాతీయవాది అయినవాడు కాశీనుండి హస్తినాపురం దాకా ('సెక్యులర్' అయితే ఆగ్రానుండి అహమ్మద్ నగర్ దాకా గూడ) తీర్థయాత్ర

జరిపి ప్రతిచోటా యధోచితంగా పరవశించిపోకపోతే వాడు జాతీయవాదే కాదు. ఈ విషయంలో లక్ష్మణరావుగారు ఫార్ములా తప్పలేదు. శాంతం తిన్నగా కలకత్తా వెళ్ళి అక్కడినుండి, ప్రాచీనకాలంలో మగధనుండి తక్షశిలకు వణిజ్రేణుల బండ్ల బాటగా మొదలయి, సుల్తాన్ల కాలంలో పకడ్బందీగా సరాయీలూ సత్రాలతో సహా పునర్నిర్మించబడి, బ్రిటిష్ కాలంలో కలకత్తానుండి లాహోర్‌దాకా గ్రాండ్‌ట్రంక్‌రోడ్‌గా (కిప్లింగ్ రవి అస్తమించని సామ్రాజ్యపు వైభవానికి విస్తీర్ణానికి ప్రతీకగా) అవతరించి, 1947 తరువాత మనకు స్వాతంత్ర్యం వచ్చిందన్న భ్రమకు రుజువుగా నేషనల్ హైవే నెంబర్ వన్‌గా పునర్నామకరణం చెందిన మార్గం గుండా (రోడ్డు మీద కాదు, రైలులో) ప్రయాణిస్తుంది. చేతిలో పుష్కలంగా డబ్బులున్నాయి కాబట్టి రైలులో రెండవ తరగతిలో (ఇవాల్టి రెండవతరగతి కాదు, మన దేశానికి సోషలిజం రాకముందు, అంటే మూడవ తరగతి పెట్టెలు రద్దు చేయబడక ముందు సంగతి ఇది) ప్రయాణించి ఒక్కొక్క ఊరూ చూస్తుంది. కాశీ, జౌవున్‌పూర్, ఢిల్లీ, శ్రీనగరం, అమృత్‌సర్ — అన్నిచోట్లా చరిత్రను ఆవాహనం చేసుకొని పులకించి పోతుంది. మనల్ని గూడ అదే అనుభూతి పొందమంటుంది. ఇలా ఇంకా ఎంతకాలం పురావస్తు పర్యటనం చేసేదో కాని శాస్త్రి ఆమెను తిరిగి రప్పించుకోవడానికి వ్యూహం పన్నుతాడు. బిర్లా కుటుంబానికి తొలినాడే కలిగిన నమ్మకం శాస్త్రికి ఇంతకాలానికి కలుగుతుంది. కాంగ్రెస్ వాళ్ళ స్వరాజ్యం తప్పక వస్తుందనీ బ్రిటిష్‌వాడు అడ్వకేట్ జనరల్ గిరీ ఇవ్వకపోతే స్వరాజ్యం వచ్చిన తరువాత సుప్రీంకోర్టు జడ్జి కావచ్చుననీ ధైర్యం వస్తుంది. ఇక అందుకు సన్నాహాలు మొదలుపెడతాడు. అంతకాలం రైతులకు వ్యతిరేకంగా జమీందార్ల కేసులు చేసినవాడు ఇప్పుడు దిక్కులేని రైతుల తరఫున ఫీజులేని వకాల్తీ పుచ్చుకొని ప్రీవీ కౌన్సిల్‌లో వాదించడానికి సొంత ఖర్చు మీద ఇంగ్లండ్ వెళ్తాడు. శాంతం సంతోషించి అతనితో కలిసి వెళ్తుంది. మధ్య తరగతి అంతరాత్మను సంతోషపెట్టడానికి నటనకంటె ఎక్కువ అక్కరలేదు.

ఇక్కడితో మొదటి అంకం పరిసమాప్తి. రెండవఅంకం రెండవతరానికి చెందినది. శాస్త్రి శాంతంలు ఎంత ఆసక్తికరమయిన పాత్రలో సుభది అంత పూర్తిగా కృత్రిమమయిన పాత్ర. నాందేడ్‌కు పన్నెండు మైళ్ళ దూరంలో ఖైలూరులో ఒక కుటుంబంలో పుట్టి పెరిగిన అమ్మాయి రెండేళ్ళు శాస్త్రీ శాంతలతో ఉండగానే తన భాషనూ భావాలనూ అంత పూర్తిగా మార్చేసుకోవడం అసాధ్య

మయిన విషయం. ఎలాగయితేనేం, వాళ్ళతోబాటు ఇంగ్లండు వెళ్ళివచ్చి పూర్తిగా ఆస్తిపాస్తులు గల కోస్తా ఆంధ్ర కాంగ్రెస్ దంపతుల కుమార్తెగా మారిపోతుంది. వీళ్ళు ఇంగ్లండ్‌నుండి తిరిగి వచ్చేసరికి రెండవ ప్రపంచయుద్ధం వాతావరణం. శాస్త్రి తన పాపాలను ప్రీవీ కౌన్సిల్‌లో కడిగేసుకొని ఖద్దరు మనిషి అయిపోయాడు. శాంతం తన వ్యక్తిత్వాన్ని వదులుకోకుండ తొలినాటి అనుమానాలు మాత్రం వదులు కొని కాంగ్రెస్‌లో ముఖ్యవ్యక్తి అయింది.

భారతదేశపు పెట్టుబడిదారీ వర్గం రెండు ప్రపంచ యుద్ధాలలోనూ కొత్త రక్తాన్ని ఎక్కించుకుంది. యుద్ధంవల్ల ప్రజలకు నష్టంగాని, వ్యాపారానికి చాలా లాభం. కాంట్రాక్టులు, నల్ల బజారు తదితర వ్యవహారాలలో కోట్లు సంపాదించు కున్నారు. రెండవ ప్రపంచయుద్ధం మన సరిహద్దులదాకా వచ్చింది కాబట్టి ఈ లాభాలు మరింత వచ్చాయి. ఇట్లా లాభాలు సంపాదించిన వాళ్ళు చాలామంది ఖద్దరు మనుషులే. మొదట్లో కానివాళ్లు గూడ లాభాలు సంపాదించిన తరువాత ఖద్దరు మనుషులయ్యారు.

నవల రెండు మూడు భాగాలలో ఈ కొత్త బూర్జువా వర్గం తరచుకనబడు తుంది. బర్మానుండి అస్సాంకు పారిపోయివచ్చిన కాందిశీకులకు అత్యధికలాభాలకు తిండిగింజలు అమ్మి వాళ్లస్త్రీలచేత వ్యభిచార వ్యాపారం నడిపించి కోట్లు సంపాదించిన ఆసామి కొడుకు సీతారాం. ఆర్మీకాంట్రాక్టులు చేసి ఇనపరాడ్ల నుండి సిమెంటు కంకర దాకా అన్నీస్వాహాచేసే కంపెనీలో ఇంజనీరు. ఇతనికి పూర్తిగా విరుద్ధంగా, ఆర్మీ ఇంజనీరుగా వుంటూ ఈ గందరగోళ పరిస్థితిలో కాంట్రాక్టర్లతో ఏమాత్రం లాలూచీ పడినా లక్షలు సంపాదించే అవకాశం ఉండిగూడ, చిన్ననాడు నీళ్ల బిందెలు మోసి తనను పెంచిన తల్లినేర్పిన నీతి వాక్యాలను తిరస్కరించలేని అర్భకుడు జనార్ధనం. అయితే అర్భకుడి నైతిక వర్తనం తన డైరీని దాటిపోదు. కాంట్రాక్టరు పై ఆఫీస ర్లతో లాలూచీ పడి రైల్వేబ్రిడ్జికి బిల్లు 12 లక్షలు ఎక్కువ వేస్తే దాన్ని ఒక్కొక్క పైసా లెక్కగట్టి బిల్లు తగ్గించినందుకు పై ఆఫీసర్లు జనార్ధనానికీ ప్రమోషన్ ఇచ్చి కాంట్రాక్టరుకు మాత్రం 10 లక్షలు పారితోషికం ఉచితంగా ఇచ్చిననాడు, 'దొంగలు దొంగలూ దోచుకొనివూళ్లు పంచుకున్నారట' అనుకోవడం ప్రమోషన్‌ను ఆమోదించి లెఫ్టినెంట్‌కల్నల్ కావడం తప్ప జనార్ధనం చేయగలిగింది లేదు.

రాజకీయంగా గూడ ఈకాలం చాలా గందరగోళమైనది. ఆ చరిత్ర గడిచి పోయిన తరువాత మనం ఇవ్వాళ రెండవ ప్రపంచ యుద్ధాన్ని గురించి సులువుగా ఒక వైఖరి అవలంబించ గలుగుతున్నాము గాని, ఈనాడు పరిస్థితి అంతస్పష్టంగా లేదు. హిట్లర్ యూదులనూ సోషలిస్టులనూ కమ్యూనిస్టులనూ కాథొలిక్కులనూ ఊచకోత కోసిన మాట వాస్తవమే. అయినా హిట్లర్‌ను ఇవ్వాళ మనం ద్వేషిస్తున్నట్టు ఆనాడు ఆసియా ఆఫ్రికా దేశాలలో అందరూ ద్వేషించలేదు. దీనికి ఒక కారణంవుంది. మొదటి ప్రపంచ యుద్ధంలో బ్రిటన్ ఫ్రాన్స్ తదితర దేశాలు కలిసి జర్మనీని ఓడిం చాయి. యుద్ధంలో గెలిచిన దేశాలు ఓడిపోయిన దేశాలను కొల్లగొట్టడం చరిత్రలో అనాదిగా వస్తున్నదేగాని, ఈ యుద్ధంలో ఓడిపోయిన జర్మనీ మీద 'నైతిక' భారాన్ని మోపి, గెలిచిన దేశాలకు జరిగిన నష్టానికి పరిహారం జర్మనీ చెల్లించాలని కొత్త సూత్రాన్ని ప్రవేశపెట్టారు. అసలే ఓడిపోయి చితికిపోయిన జర్మనీ ఈ నష్టపరిహారం చెల్లించలేక మరింత క్రుంగిపోయింది. అపూర్వమయిన ద్రవ్యోల్బణం జర్మనీ ఆర్థిక వ్యవస్థను ఛిన్నాభిన్నం చేసింది. దీనిని ప్రపంచంలోని ప్రజాస్వామిక వాదులంతా నిర సించారు. పైగా జర్మనీని ఇట్లా అణగదొక్కుతున్న బ్రిటన్ ఫ్రాన్స్‌దేశాలు ప్రపంచ వ్యాపితంగా సామ్రాజ్యాలు నెలకొల్పి ప్రపంచ ప్రజలను దోచుకుంటున్న దేశాలు కావడంవల్ల ఈ వ్యతిరేకతకు బలం వచ్చింది. ఈ పరిస్థితిని ధైర్యంగా ఎదుర్కొన్న వాడు హిట్లర్. అతను అధికారానికి వచ్చిన వెంటనే వర్సయిల్స్ సంధిని త్రోసిపుచ్చి, ఇక నష్టపరిహారం చెల్లించబోమని ప్రకటించాడు. ఆసియా ఆఫ్రికా దేశాలలో చాలా మంది ఈ సాహసాన్ని హర్షించారు. అందుకనే హిట్లర్ పక్షం వహిస్తే మనకు స్వరాజ్యం వస్తుందని చాలామంది నమ్మగలిగారు. మరొకవైపు, నాజీవాదం పుట్టుకకు బాధ్యత ఎవరిదయినప్పటికీ, అది ప్రపంచంలో ప్రజాస్వామ్యానికి పెద్దగొడ్డలి పెట్టని కొందరు గ్రహించారు. రెండవ ప్రపంచ యుద్ధం మొదలయిన తొలిసంవత్సరాలలో జర్మనీ సాధిస్తోన్న విజయాలను చూసి ఈ భయం ఇనుమడించింది. చివరికి హిట్లర్ తనకు ఎటువంటి అపకారం చేయని సోవియట్ రష్యామీద గూడ దాడి చేసినప్పుడు ఇంకా ఏవయినా అనుమానాలు మిగిలివుంటే అవి గూడ పటాపంచలయ్యాయి.

ఇటువంటి వాతావరణంలో భారత జాతీయ ఉద్యమం ఏ వైఖరి అవలంబించా లన్నది సులువయిన నిర్ణయం కాదు. కమ్యూనిస్టులనో, సుభాష్‌చంద్రబోసునో దూషించడానికి చరిత్రను వక్రీకరిస్తే అది వేరే సంగతి. కాంగ్రెస్‌లోగూడ దీని

గురించి ఏకాభిప్రాయం లేదు. గాంధీ, పటేల్, నెహ్రూ, రాజాజీ, అజాద్-ఒక్కొక్కరికీ ఒక్కొక్క వైఖరి. బ్రిటిష్ యుద్ధ ప్రయత్నాలకు సహకరించాలని కొందరు భావిస్తే, జపాన్‌తో చేతులు కలపాలని కొందరు, తటస్థంగా వుండాలని కొందరు, బ్రిటిష్‌వాళ్ళను బెదిరించి రాయితీలు తీసుకోవాలని కొందరు అభిప్రాయపడ్డారు. గాంధీ ఎప్పటిలాగే బ్రిటిష్ వాళ్ళతో మంతనాలకు దిగి వీలయినంతలాభం సంపాదించా లని ప్రయత్నించాడు. మూడునాలుగేళ్ళపాటు మంతనాలు ఎడతెరిపిలేకుండసాగాయి. అయితే ఈసారి బ్రిటిష్‌వాళ్ళు లొంగిరాలేదు. దానికి కారణం ఎంతవరకు పరిస్థితుల తీవ్రత, ఎంతవరకు చర్చిల్ మూర్ఖత్వం అనేది చరిత్రకారుల చర్చ. ఇక అప్పుడు (1942 ఆగస్టులో) 'క్విట్ ఇండియా' తీర్మానంచేయక కాంగ్రెస్‌కు తప్పలేదు. ఈ తీర్మానాన్ని కాంగ్రెస్‌యొక్క దేశభక్తి పరాక్రమ శీలానికి నిదర్శనంగా కొనియా డడం ఇవ్వాళ అరుణ్‌శౌరికి చెల్లిందిగాని, నిజానికి ఆనాడు అది కాంగ్రెస్ గత్యంతరం లేక తీసుకున్న నిర్ణయం. అంతకు మూడేళ్ళముందు, యుద్ధం మొదలయిన అదను చూసుకొని సత్యాగ్రహం ప్రారంభిస్తే స్వరాజ్యం సాధించవచ్చునని కాంగ్రెస్‌లో ప్రతిపాదన వచ్చినపుడు గాంధీ 'ఇప్పుడు సత్యాగ్రహం ప్రారంభిస్తే అదుపులో ఉంటుందని నమ్మకంలేదు' అని తిరస్కరించాడు. అటువంటి వాడు మూడేళ్ళ గడిచే సరికి ప్రజలను అన్నిరంగాలలోనూ తిరగబడి బ్రిటిష్ వాళ్ళను తరిమేయమని పిలు పిచ్చాడంటే, అందులో పరాక్రమంకంటే రాజకీయమే ఎక్కువవుంది.

కాంగ్రెస్ నాయకులలో చాలామందికి ఈ నిర్ణయం నచ్చలేదు. రాజాజీ పార్టీ వదిలి వెళ్ళిపోయాడు. నెహ్రూ అయిష్టంగా వుండిపోయాడు. బోసు అంతకుముందే వెళ్ళిపోయాడు. ఒక్క కాంగ్రెస్‌లోని సోషలిస్టు బృందం మాత్రమే ఆ నిర్ణయాన్ని మనస్ఫూర్తిగా సమర్థించింది. సామాన్యప్రజానీకంలోని సామ్రాజ్యవాద వ్యతిరేకతకు ఈ పిలుపు ఒకమార్గం చూపెట్టింది. కాబట్టి వాళ్ళుమాత్రం అపూర్వమయిన ఉత్సా హంతో స్పందించారు. నాయకులులేక నాయకత్వంలేక ఒక ఆరునెలలపాటు పెట్రోల్ మండినట్టు మండారు.

శాస్త్రికిగూడ గాంధీ వ్యవహారం నచ్చలేదు. శాస్త్రికే కాదు, కాంగ్రెస్‌లోని శాస్త్రివర్గానికి ఈ కొత్తపిలుపు ఎంతమాత్రం రుచించలేదు. 1942 ఆగస్టు నుండి శాస్త్రి ఒకకాలు రాజాజీ క్యాంపులో, ఒకకాలు గాంధీ కాంగ్రెస్‌లో పెట్టి నడుస్తున్నాడు. పోనీ కాంగ్రెస్‌లోని శాంతం వర్గానికయినా నచ్చిందా అంటే అదీ లేదు. అంతకాలం

అహింస ఒక్కటే నీతివంతమయిన మార్గమనీ హింస పాపమనీ కమ్యూనిస్టులనూ ఇతర మిలిటెంటు జాతీయవాదులనూ తూలనాడి ఇప్పుడు ఒక్కసారిగా తిరుగుబాటు చేయమంటే వాళ్ళకు తికమక అయింది. అందుకే తన కమ్యూనిస్టు చిన్న కూతురు లక్ష్మి పేళాకోళం చేస్తే చెప్పడానికి శాంతం దగ్గర సమాధానం లేదు.

కాంగ్రెస్ తీసుకున్న 'క్విట్ ఇండియా' నిర్ణయం కమ్యూనిస్టులకు గూడ ఇబ్బంది అయింది. నవలలో లక్ష్మి, అమృతరావు, అమృతవల్లి, చాలా గంభీరంగా కనబడతారుగాని అది చాలావరకు లక్ష్మణరావుగారు కృత్రిమంగా కల్పించిన గాంభీర్యమే. అంతవరకు మిలిటెంట్ జాతీయవాదులుగా కనబడ్డ కమ్యూనిస్టులను కాంగ్రెస్ వారు మొట్టమొదటిసారిగా 'దేశద్రోహులు' అని దూషించగలిగారు. తమ అంతర్జాతీయతను జాతీయతను సమన్వయ పరచలేక కమ్యూనిస్టులు సందిగ్ధంలో పడ్డారు. పాకిస్తాన్ విషయంలోనూ అంతే. కాంగ్రెస్ - ముస్లింలీగ్ పార్టీల రాజకీయాలు దేశ విభజనకు అనివార్యంగా దారితీస్తున్నవైనాన్ని వివరించకుండ, 'జాతిసమస్య' పేరిట జిన్నాను సమర్థించి మళ్ళీ 'దేశద్రోహులు' అనిపించుకున్నారు. దానివల్ల, తెభాగావంటి బలమయిన రైతాంగపోరాటం నడిపిన బెంగాల్‌లోనే, ఆ పోరాటం ఆగీ ఆగక ముందే అదే జిల్లాలలో హిందూముస్లిం మతకలహాలు పెల్లుబికినప్పుడు నిస్సహాయంగా చూస్తూ ఉండిపోయారు. సుభకూ శాంతంకూ తమ పార్టీపై ఖరి వివరిస్తూ అమృతవల్లి ప్రదర్శించిన దృఢత్వం కల్పితమయినదే.

ఈ లోపాన్ని మినహాయిస్తే, ఆ కాలపు సంశయాలనూ సందిగ్ధాలనూ నవల చక్కగా ప్రతిబింబిస్తుంది. లక్ష్మి, సుభ, శాంత, జనార్ధనం, సీతారాం, అమృతరావు, శాస్త్రి — నవలలోని పాత్రలంతా ఈ దశలో రాజకీయ చర్చలలోకి దిగుతారు. ఎవరి 'లైన్' ను వారు బలంగా సమర్థించుకుంటారు. ఏ లైనూ లేని సుభ, జనార్ధనం వంటివారు 'అదీ నిజమే ఇదీ నిజమే' అన్నట్టు సంకటంలో పడతారు. క్రమంగా ఏ నిర్ధారణకూ రాకుండ (కాంగ్రెస్ వారి జాతీమోద్యమం ముగిసినట్టే) నవల అంతమవుతుంది. మన జాతీయోద్యమం దాదాపు ఏ సమస్యనూ పరిష్కరించకుండా ముగిసింది. అందుకే కాబోలు నవలను ఎట్లా ముగించాలో తెలియక చవకబారు రొమాంటిక్ నవల లాగ ముగించారు లక్ష్మణరావుగారు. ఇది ఆయన శిల్పం మీద కాంగ్రెస్ పార్టీ సాధించిన విజయం.

# పోలీసు తుపాకులు తునికాకు తెంపవా !

సాధన

పోలీసుల తుపాకులు మద్దునూరు రాజేశ్వరరావు భూమి దున్ని పంటలు పండించిననాడు, సిరొంచ దగ్గర అమ్‌రాజ్‌లోని రాజు పంతులు భూమిలో దుక్కి-దున్ని - దున్నిన నాగేటి చాళ్ళలో విత్తనాలు చల్లి మొలకలు మొలిపించిననాడు మాత్రమే ప్రజాభిప్రాయ ప్రమేయం లేకుండా ప్రజలతో నిమిత్తం లేకుండానే తుపాకులు - తుపాకుల్లోని తూటాలు - పోలీసుల నడుములు వంచనివ్వకుండా తునికాకు తెంపగలవేమో గాని ఇవ్వాళ మాత్రం వాటికి సాధ్యము కాదనే 'ప్రజా తీర్పుకు' ప్రతిస్పందన ఈ వ్యాసం. తుపాకుల తూటాలు ఆకలిజీవుల అంతు చూడ గలవు కాని ఆకలి అంతు తెలుసుకోజాలవు.

ఇవ్వాల గడచిరొలి - చంద్రపూర్ జిల్లాల్లో అందులో అడవినానుకొని ఉన్న ఆదివాసి-గైరాదివాసి ప్రజల్లో ఈ సమస్య పెద్ద చర్చనీయాంశమై కూచుంది. రాజీవుని జేబు సంస్థ 'నిండా నూరేళ్ళు పండిన' కాంగ్రెస్ బడా నాయకులు బొంబాయిలో కూచోని సరిగ్గా ఇదే సమస్యపై అనేక తీరుల తీర్మానాలు చేస్తూ వ్యూహం రచిస్తుంటే 'పూరీ'లో మహారాష్ట్ర - మధ్యప్రదేశ్ - ఆంధ్రప్రదేశ్ - ఒరిస్సాల పోలీసు అధికారులే కాకుండా 'నక్సల్బరి'ని నెత్తురుటేరుల్లో ముంచిన మహా ఘనత వహించిన నయా రివిజనిస్టు సర్కార్ వారి పోలీసుబంట్లు కూడ క్రొత్తగా షరీకై ఈ సమస్య సమూల నిర్మూలనం గూర్చి ఎత్తుగడలు రూపొందించడములో ఎవరి పంతూ వాటా ఎంతో కూడబలుక్కుంటున్నారు. ఉత్తర తెలంగాణా జిల్లాల్లో ప్రజలపై - ప్రజా ఉద్యమకారులపై సామూహిక హత్యాకాండ నిస్సిగ్గుగా బరితెగించి కొనసాగిస్తున్న అన్న - రామన్న పోలీసులు సరిహద్దు ప్రాంతాలైన గడచిరొలి - చంద్రపూర్ - బస్తర్ జిల్లాల్లో 'ఉగ్రవాదుల' కార్యకలాపాలు పెచ్చు పెరుగుతుంటే గాలింపు చర్యలు కొనసాగించకుండా మీరేమి చేస్తున్నారని ఇక్కడి పోలీసులను బహిరంగంగానే దబాయించడాన్ని రేడియో వార్తలే చెబుతున్నాయి. 'నక్సలైట్లకు 'రెడ్‌శల్యాట్స్'' అని అన్నాడు అన్న ఎందుకన్నాడో అందరికీ స్పష్టమవుతోంది.

ఢిల్లీలో బాంబు సంఘటన దారులు ఉగ్రవాదులు - గడచిరౌలిలో విప్లవ కారులూ ఉగ్రవాదులే. పోతే ఢిల్లీలో సిక్కులపై ఊచకోత కోసినవారు అహింసా వాదులు. భోపాల్ గ్యాస్ దుర్ఘటన బాధ్యులు పరమ సాత్వికవాదులు - బీహార్ బాంజీ భూస్వాములు శ్రీమాన్ బిందేశ్వరి దూబే దృష్టిలో శాంతివాదులేనని 19 మందిని చంపినందుకు సర్టిఫికేట్ జారీచేశారు. ఇందుకే కాబోలు పాపం పార్లమెంట్ లో కూచున్న ప్రజాప్రతినిధులు ఉగ్రవాదుల గూర్చి భారత శిక్షాస్మృతిలో వున్న చట్టాలు - శాసనాలు సరిపోవడం లేదని పాత చట్టాలను సవరిస్తూ క్రొత్త చట్టాలను రూపొందించుకోవలసిన పరిస్థితికి ఎదగాల్సి వచ్చింది. దొరికిందే తడవుగా ఆంధ్రుల ఆత్మాభిమానాన్ని, ఆడపడుచుల మానాన్ని కాపాడటానికి సదరు చట్టాలకు లోక్‌సభ లోని తెలుగు ప్రజాప్రతినిధులు ఆమోదముద్ర వేసి సంతకాలు చేసి మరీ సంతోషం వెలిబుచ్చారు. 1984 మే 10వ తేదీన గడచిరౌలి జిల్లాలో పూస్‌టోల దగ్గర అరెస్టు చేసిన కా॥ భీమన్న, కా॥ సాయన్నను యేడాది గడచినా 'నాసా'లో పెడుతూ బయటికి రాకుండా చూస్తు తిప్పలు పడుతున్న మహారాష్ట్ర పోలీసులు 1985 మార్చి 12వ తేదీనాడు మోహర్లీ దగ్గర కా॥ మారన్నను అరెస్టు చేసి రోజుల తరబడి లాకప్పులో అనేక చిత్రహింసలకు గురిచేస్తూ రోజుల తరబడి ఇబ్బందుల పాలు చేసి నేనేమీ తీసిపోలేదని సోదర రాష్ట్రాలకు ముఖం చూపిస్తుంది. ఇది ఇలా ఉండగా 7-2-1985 నాడు జీలేడుపాడు వద్ద గుండంవాగులో కా॥ శివకుమార్‌ను 5-3-1985 నాడు లాడ్ బైర్ దగ్గర కా॥ గణపతిని బస్తర్ ప్రత్యేక పోలీసులు 'రాత్‌వాలా' చంపి నాలుగేళ్ళ కాని చరిత్రలో 'నేనేం తక్కువనా' అంటూ సమావేశాల్లో ఇసాబులు చేసుకుంటూ చేతులు కలుపుకుంటున్నారు. లెక్కలు సరిచూసుకుంటున్నారు. ఇంతే గాకుండా ప్రజల నుండి ఉద్యమకారులను దూరం చేయడానికి రాజీవుని కోపానికి బలై గద్దె దిగిపోయిన వసంత దాదా పాటిల్ ప్రభుత్వం చేపట్టిన చర్యలను పరి లోకిద్దాము.

మహారాష్ట్రలో భారత కమ్యూనిస్టు పార్టీ (మా-లె) 'పీపుల్స్‌వార్' కార్య కలాపాలు గత 5 సంవత్సరాలనుండి కొనసాగుతున్న విషయం అందరెరిగినదే. పాత సామ్రాజ్య శక్తులపై ఆర్థికంగా, రాజకీయంగా, సాంఘికంగా తిరుగుబాటు చేస్తూ నూతన సమాజాన్ని ఆహ్వానించటానికి తెగించి పోరాడుతున్న పోరాటకారులపై సహ జంగానే హక్కులు కోల్పోతున్న వర్గానికి అధికారాన్ని నష్టపోతున్న శక్తులకు కసి,

పగ, ద్వేషం రేగక తప్పదు — అనేక ఆర్థిక ప్రలోభాలకు ఎర చేసినప్పటికీ లొంగని ప్రజానీకం నడ్డి విరగగొట్టడానికి గరీబీ హఠావో సర్కార్ పడరాని తంటాలు పడుతుంది — అనేక విజయాల ద్వారా 4 యేళ్ళ క్రమంలో పెంచుకున్న రేటు 70 తునికాకుల 100 కట్టలకు 3 రూపాయిలు నుండి 17 చేసుకోవడాన్ని చూసి బెంబేలు పడిపోయిన సర్కార్ నక్సలైట్ల విస్తరణ విప్లవోద్య దావానలాన్ని సృష్టించడం నిజమేనని అంటుకున్న అడవి మంటలను కిరోసిన్ చల్లి ఆర్పాలను కుంటుంది. అందుకే — ఖచ్చితంగా అందుకే — సిరొంచ నుండి చౌడంపెల్లి వరకు విస్తరించినందుకే — గుమ్మలకొండ నుంచి కువ్వాకోడి వరకు ఆదివాసి గూడాల్లో పలుకుబడి పెంచుకోగలిగినందుకే పునాదులు కదలిపోతున్నాయని గ్రహించిన సర్కార్ వారు సలహా కమిటి సలహాపై ఆధారపడి ఒక్క కలంపోటుతో 17 పైసలుగా పెరిగిన రేటును 10 పైసలకు కుదించివేశారు. 'ఖాస్‌దార్'గా (M P) కన్న తండ్రి రాజా విశ్వేశ్వరరావు ఎన్నికల జాతరలో గెలవకపోగా తన కొడుకు ఆత్రం సత్యవన్‌రావ్ 'ఆమ్‌దార్' (M L A)గా ఎన్నికల్లో ఆదివాసి ప్రతినిధిగా గెల్చి సదరు కలంపోటుకు దొంగచాటుగా ఆమోదం తెలిపి ఎన్నికల్లో ఇచ్చే వాగ్దానాల మాట నిజం ఎంతో శషభిషలు లేకుండా తేల్చేశాడు. ఖరారైన రేటుకు 'నిఖారైన' సర్కార్ ప్రపంచ కార్మికదినం — మహారాష్ట్ర అవతరణ దినోత్సవమైన మే 1వ తేదీ నుండి అడవిలో ఏర్పాటు చేసిన కళ్ళాలపైకి తునికాకు రావాలని, ప్రజలు నిరాకరిస్తే ఒత్తిడి తెండంటూ జంగ్లాత్ గార్డులకు దఫేదార్లకు తాకీదులు పంపారు. ఒకవేళ వారు నిరాకరించినా, వ్యతిరేకించినా సహించకూడదనీ, పనులు బందుపెట్టమని వారిని ప్రోత్సహించి ఎవరైనా వారిని సమ్మెకు పురికొల్పితే సొట్లు సోదించైనా సరే వారిని ఏరివేయాలని 18 బెటాలియన్ల ప్రత్యేక పోలీసులను రోజుకు మూడు లక్షల రూపాయిల ఖర్చుకు సిద్ధపడి దిగుమతి చేసుకొని అల్లపెల్లి- ఐహిరి- సిరొంచ - ఏటపల్లి- ఛామ్రాఘడ్ అడవి ప్రాంతంలోనికి పంపించింది. రోజుకు 3 లక్షలనగా ఈ పోలీసు బలగాలు 2 మాసాల మకాం కొరకు వచ్చారంటే 1 కోటి 80 లక్షల ఖర్చు - పోగా సర్కార్ ఠేకేదార్లకు ఇవ్వడం మూలానా ఇప్పటివరకు పొందిన 1 కోటి రూపాయల రాయాల్టి పన్ను ఈ సారి కోల్పోయింది. ఇంతే గాకుండా ఈ అదనపు పని భారాన్ని నిర్వహించడానికి రిక్రూటు చేసుకున్న అనేక మంది జంగ్లాత్ శాఖ ఉద్యోగస్థులకు ఖర్చు - ఇవన్నీ కూడితే ఐదు కోట్లు దాటుతుందనే

అధికార వర్గాల వారి అంచనాలను బట్టి తేలుతుంది. రాజ్యాధికారం కొరకు సాగుతున్న రాజకీయ పోరాటాన్ని నిర్మూలించడానికి ఈ ఖర్చును ప్రభుత్వం భరించడం తప్పని సరి. దాని ఉనికికి సంబంధించిన ప్రశ్న కాబట్టి లెక్కలోనికి రానిదే. ఏప్రియల్ చివరి వారం నుండే సన్నాహాలు ప్రారంభమయ్యాయి. జంగ్లాత్ అధికారులు తమ ఉద్యోగబృందాలతో సమావేశాలు జరుపుతూ తర్జన భర్జనలు కొనసాగిస్తుండగా పోలీసు ఉన్నతాధికారులు గ్రామ పోలీస్ పటేల్లు - కొత్వాళ్ళతో కూడిన సమావేశాలు, అధికారులతో - అనధికారులతో తరచుగా సమావేశాలు ఏర్పాటు చేస్తూ ఎన్నో హుకూమ్‌లు పోలీస్ 'విజ్ఞప్తులు' జారి చేశారు. అడవిలో చేయాల్సిన గాలింపు చర్యలు ఎలా ఉండాలో అల్లపెల్లిలో రిహార్సల్స్ చేసి భామ్రాఘడ్ నుండి కోలి వరకు 300 మంది పోలీసులు ఒక్కసారి అడవంతా గాలించి మొదటి ప్రయత్నంలో అనుకున్న ఫలితాన్ని సాధించడములో విఫలమయ్యారు. ఎక్కడికక్కడి రేంజి అధికారులు పాత కళ్ళేదార్లను పిలిచి ఆకు తెంపించాలంటూ సమావేశపరచారు. రేపు కళ్ళాలు ప్రారంభమవుతాయనగా ఎక్కడి రేంజర్లు అక్కడే ఈసారి ప్రభుత్వం కేటాయించిన ప్రత్యేక జీపుల్లో పహార్లు కొడుతూ మైకుల్లో "ఆకులు కోయండొహో" అంటూ గొంతు చించుకుంటూ అరిచారు. మరోవైపు మొబైల్ కోర్టు (స్పెషల్‌స్క్వాడ్) వారు కూడా రంగంలోనికి దిగారు. కళ్ళాలు ప్రారంభం కాకపోతే అడవిలో అడుగు పెట్టనివ్వమన్నారు. కంపకు, పొరుకకు, కర్రకు మా అడవిలో నుండి పూచికపుల్ల కూడ తేనివ్వమన్నారు. మీరు ఇండ్లలో చేసుకున్న కర్ర లెక్క చేసి దండుగలేస్త మన్నారు - ప్రజల్లో భయాందోళనలు సృష్టించారు. అడవిలో చేసిన పనికి బకాయి పడిన డబ్బులు ఎగవేస్తామని బెదిరించారు. ఉద్యమం విస్తరించిన ప్రాంతములోని దాదాపు 700 గ్రామాల్లో 70 క్యాంపుల వరకు పదుల కొద్ది పోలీసులతో వెలిశాయి. ఇంత హంగామా చేసుకున్నప్పటికి కూడా ఆకు కళ్ళాలపైకి వస్తుందో లేదోనని ఇంకి తక్కెడంత పిరికి సర్కార్ వారికి ఉండనే ఉంది. అందుమూలంగానే మరో ప్రక్క పెద్ద ఎత్తున దుష్ప్రచారానికి కూడ సిద్ధమయ్యారు. ఎక్కడికక్కడే జంగ్లాత్ మరియు పోలీస్ అధికారులు ప్రజలను ఎన్నోరకాలుగా బెదిరించారు. నక్సలైట్ల ప్రవేశాన్ని విరోధించడానికి అనాడు పెద్దిశంకర్‌ను హత్యచేసి నక్సలైట్లు దొంగలు -లంగలు -పట్టాలి -కొట్టాలి అని రకరకాలుగా ప్రచారానికి ఒడిగట్టిన పాలకవర్గాలు గత అనుభవాన్ని నెమరువేసుకుంటూ వర్తమానంలో పునరామిస్తున్నాయి. ప్రజలను తన వెనుక నిలబెట్టుకోవడం ఇరు పక్షాలకు-ఇటు నక్సల్‌వాదికి అటు పాలకవర్గాలకు

తప్పనిసరి. అయితే ఒకరు అడు (జడుపు)తో బెదిరింపులతో, లాఠీలతో, తూటాలతో తన వెనుక నిలబెట్టుకోవడానికి అనేక భగీరథ ప్రయత్నాలు చేస్తుంటే మరొకరు ప్రేమతో, మంచితనంతో, వాత్సల్యంతో వారి తరతరాల బాధలకు మార్గం చూపిస్తూ వారి చైతన్యం పెంపొందింపచేస్తూ వారిని వెనుక నిలబెట్టుకోవడానికి తీవ్ర ప్రయత్నం చేస్తారు. ఇది ఈ ఇద్దరి మధ్య తేడా. ఒకరి వర్గ ప్రయోజనాలకై మరో వర్గాన్ని బలి తీసుకోవడం ఒకరి నీతి, ఒకరి న్యాయమైతే కార్మికవర్గ ప్రయోజనాలకై పీడిత ప్రజలను నిలబెట్టుకోవడం మరొకరి కర్తవ్యం. పార్లమెంటులో ప్రధానమంత్రి సిక్కు ఉగ్రవాదులను సిక్కు ప్రజల నుండి ప్రథమంగా దూరం చేయాలని సెలవిచ్చాడు. అందుకే అతని తల్లి సిక్కు ప్రజల పవిత్రాలయము స్వర్ణదేవాలయం మీద పరమ కిరాతక భారత మిలట్రీ శక్తుల పాదాన్ని మోపించింది. ప్రతీకారంగా తన ప్రాణంతో తన ఋణాన్ని తీర్చుకుంది. ఇవ్వాళ తిరుగబడుతున్న ప్రజలను ఉగ్రవాదులు అని ముద్రవేసి వారిపై దాడికి సిద్ధమవుతుంది. తన చావును తానే కోరి తెచ్చుకుంటుంది. ఇవ్వాళ ఉగ్రవాదులు ఉగ్రవాదులు అంటూ భూనభోనాంతరాలు దద్దరిల్లేట్లు పాలకవర్గాలు మొత్తుకుంటూన్నాయి. అందులో భాగంగానే గడచిరోల్లి ప్రభువర్గాలు నక్సలైట్లు హంతకులు - ఆకులు తెంపే ఆడవాళ్ళ చేతులు అడవిలో కోస్తున్నరు - బట్టలు విడిపించి స్త్రీలతో బతుకమ్మలాడిస్తున్నారు - చీరలు కాలబెడుతున్నారు - చేతులు చెట్లకు పెట్టి జిమ్మలఘట్ట అంగట్లో కొన్ని మొలలు కొడుతున్నరు - తలపై చేతులు పెట్టి మొలలు కొడుతున్నరు - స్త్రీల జుట్లు కత్తిరిస్తున్నారు - అని తలా తోకాలేని అభాండాలు - ఆరోపణలు పోటీపడుతూ చేశారు - ఇది ఈ సమస్యకు సంబంధించిన ఒక పార్శ్వపు చిత్రమే — మే 1వ తేదీన కోత్వాల్ ఆకు తెంపాలనీ చేసిన యేలాన్ (ప్రకటన/చాటింపు) ప్రపంచ కార్మిక వర్గ పోరాట చరిత్రను ఇపుడిపుడే తెలుసుకుంటున్న ఆదివాసీలపై ఏమీ ప్రభావము చూపడమే గాదు కసిని రేపింది. మే 3వ తేదీనాడు కమలాపూర్ రేంజి జనం కూడబలుక్కోవడానికి దారి తీసింది. ఊరి ఊరి ప్రతినిధులు సమావేశమై 6 కోట్లు ఖర్చుకు వెరవని సర్కార్ పట్టుదలతో వుండి 5 పైసలు కూడ పెంచనపుడు మనకేనా పట్టుదల లేనిది ? అని సర్కార్ యేలాన్‌కు సవాల్‌గా నిలబడ్డారు. తాడిగాం రేంజి నాయకులకు ఈ సమావేశం మార్గదర్శకమై ఊపునిచ్చి ఉత్సాహాన్నిచ్చి మే 7వ తేదీ నాటి తాడిగాం సమావేశానికి త్రోవ చూపింది. ఎన్నికల్లో నిల్చొన్న నాయకులు జీపుల్లో ఓట్లకై తిరిగినట్లు రేంజర్లు ఆకులపై ఎంత ప్రచారం చేసినా ఈ సారి ఎన్ని

కల అభ్యర్థికి ఎన్ని ఓట్లు వచ్చాయో ఆ మేరకైనా పాపం రేంజర్లు విజయాన్ని సాధించలేకపోయారు. ఆకులు తెంపించలేక పోయారు. 18 బెటాలియన్‌ల పోలీసులు అడవిలోకి దిగి ఖాకీవనంగా తయారు చేసినా జంకని జనం ప్రతినిధులు అల్లపెల్లికి రేటు విషయం తేల్చుకోవడానికి పోయారు. పోలీసుల సాయుధ ప్రదర్శనలు వారిని నిరోధించలేదు - శాంతి భద్రతలకు ముప్పు ఏర్పడిందని 70 గ్రామాల్లోకి పోలీసులు దిగినప్పటికి కమలాపూర్ ప్రజలు 'మీ జీతాలు తక్కువ చేస్తే మీరు మీ పనులు నిర్వహిస్తారా ? బొంబాయిలో పోలీసులు నాగపూర్‌లో జగలయ్యలు బ్రతుకుదెరువు కొరకు సమ్మెలు ఎందుకు చేస్తున్నారు ?' అనిసూటిగా ప్రశ్నించడంతో యమదూతలు తోక ముడవక తప్పలేదు - ప్రధానంగా కమలాపూర్ - పెరిమిళి - తొడిగాం - ఏటపల్లి - ఖాద్రమాషడ్ - గట్ట రేంజిల్లో ప్రజలు ఒక్క మాటపై నిలబడ్డారు - జంగలోనికి జడువక జంగల్‌ని విడవమన్నారు - జై ఊక్కైనా పోతామన్నారు — కాలం కాక పోయి నేడు మా పంటలన్ని బోయాయి - దుష్కాల్‌తో బాధపడుతున్నాం - చచ్చిపోతున్నా మా - వరి పంట పోతేనే మేము చావలేదు రేఖ పండ్లు తిని బతుకుతాము - జొన్న పంట లేకపోయినా జావ తాగి బ్రతుకుతాము - ఇప్పపూలు - గారెకాయ చెట్లు పూయక కాయకపోతే ఫికరుగున్నా గుండె జారలేదు - గిన్ని పోంగ లేనిది గీ ఆకులు పోతే వాటి జంటకు ఇవి కూడ పోయాయనుకుంటము కానీ ఆ సర్కార్‌కు ఒక్క కాడ లొంగుతే ఇగ మా బ్రతుకే సర్వనాశనం ఐతదని తెగేసి చెప్పారు.

పోతే జిమ్మలఘట్ట - ప్రాణహిత - సిరొంచ - అహ్రెల్లి - దేశిలి - రేంజిల్లో నామమాత్రంగా కొన్ని గ్రామాల్లో ఎన్నో తంటాలు పడగా సర్కార్ లక్ష్యంలో పదోవంతు కూడ ఆకు తెంపించలేకపోయింది. కేవలం తనకు ఏజంట్లుగా - బంట్లుగా బ్రతుకులీడుస్తున్న ఒక సెక్షన్ వాళ్ళు పని చేసి సర్కార్‌వారి ప్రాపకం పొందితే పీడిత ప్రజానీకమంతా ససేమిరా ఆకు తెంపమన్నారు - కంపకు పోకరుకు అడవిలోనికి రానివ్వమంటే నీ అడవికి మేమే రామని జనం ఎదురు నిలచారు. నీ నర్సరీ పెంచరాము - మొక్క నాట రాము - వీడింగ్ చేయం - రోడ్డుపని, నీ సాయుబుకు చేయని మీ పని మీరే చేసుకోండి అని జనం తన శక్తి చూపేసరికి గుండె డీల పడ్డ సర్కార్ పుల్లరి కట్టండంటూ ఒత్తిడి తెచ్చింది - కర్రకు చీటి చేయండంటూ ఖానూన్ మాట్లాడే సరికి నీ ఖానూన్‌తో గరీబువానికి పని లేదు - ఖానూన్ వ్రాసి నోన్నే ఖానూన్ నడుపమను అని చక్కగా చెప్పారు - ఇక పాలుపోని సర్కార్ నోట మాటరాలేదు -

విజయాన్ని సాధించుకున్న జనం ఉత్సాహంగా అనేక పోరాటాలు చేబడుతారని ఆశిద్దాం- సర్కార్ స్వభావాన్ని అర్థం చేసుకున్న ప్రజలు బ్రతుకు పోరాటంలో సర్కార్ చట్టాలకు వెరువక సవరగా నిలబడడానికి పోరుపథంలో పురోగమిస్తున్నారు.

నాటక సమీక్ష :

# పోలీసు దేవత

పత్రికల్లో రోజూ అడే డ్రామాలు చాలక పోలీసులు ఈ మధ్య వరంగల్ నగరంలో 'ప్రజాదేవత' అనే స్టేజీ డ్రామా ఒకటి ఆడించారు. మహాఘనత వహించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారి సమాచార, పౌరసంబంధ శాఖవారు ఆహ్వానం పలుకగా, సాంస్కృతిక వ్యవహారాల శాఖవారు వారియొక్క 'రిపర్టరీ'తో ప్రదర్శింపబడజేసినట్టి ఆ 'నాటక' క్రమం ఇది.

తెరలేచాక కోదండరామస్వామి గుడిలో అర్చన జరుగుతూ ఉంటుంది. పూజారీ ఇతరులూ ఉంటారు — కథ : ఒకానొక గ్రామంలో హరిజనుడయిన దప్పరాముడు ఎమ్మెల్యేగా గెలుస్తాడు. అతణ్ని ఆగ్రామ పెద్దలు గెలిపించి అతని భుజాలమీద పెద్దభారాన్ని మోపారని అతడే వినయంగా ప్రకటిస్తాడు. మొదటినుంచీ ఆ వూరిగుడిలో పూజారి పూజచేసే సమయానికి ఈ దప్పరాముడు హాజరై అతని మంత్రాలకి అనుగుణంగా తన మాదిగడప్పుని వాయిస్తూ ఉంటాడు. ఇది చాలా కాలంగా జరుగుతూ వస్తున్న ఆచారం. ఆ పూజారి చాలా ఉదార స్వభావుడు. అందువల్ల ఆ మంత్రాల్లో ఉన్న అర్థాలన్నీ ఈ దప్పరాముడికి వివరిస్తూ అతని జ్ఞానాన్ని పెంచుతుంటాడు.

దప్పరాముడు ఎమ్మెల్యే అయాక అదే గుడిలో రాముడి ముందు ప్రజల శ్రేయస్సుకోసం పనిచేస్తానని ప్రతిజ్ఞ చేస్తాడు. అదే సమయంలో అక్కడికి వచ్చిన ఆ గ్రామభూస్వామి హరిజనుణ్ని గుళ్ళోకి రానిచ్చినందుకు పూజారి పై ఆగ్రహించి తాను ధర్మకర్తగనుక అతణ్ని పూజారితనంనుంచి తొలగిస్తాడు. ఆ పూజారి తన రాముణ్ని శరణువేడుతాడు. అప్పుడు దప్పరాముడు అంతటి విజ్ఞానఖని ఐన ఆ పూజారికి అభయమిచ్చి తమగూడెంలో మరోగుడి కట్టించి పూజారిని అక్కడి నియమించి ఆదుకుంటాడు. పూజారి హరిజన రాముణ్ని కొలుచుకుంటూ హరిజనుడైన దప్పరాముడికి మంత్రశాస్త్ర రహస్యాలు బోధిస్తూ ఉండిపోతాడు.

ఇదిలావుంటే ఆ వూరి భూస్వామి దగ్గర దప్పరాముడి పెద్దకొడుకు పాలేరుగా వుంటాడు. ఆ భూస్వామి కూతురు గౌరి ప్రభుత్వం వెట్టిచాకిరీనించి విముక్తి కలిగిస్తున్న ఈ రోజుల్లో ఇంకా ఈ చాకిరీ చెయ్యటం అనవసరమని అతనికి ఉద్బోధిస్తుంది. అతనుగూడా కళ్లుతెరచి నిజం గ్రహించి చాకిరీ మానేస్తాడు. అప్పుడు భూస్వామికి కోపం వస్తుంది. కానీ గౌరి తండ్రిని ఎదిరించి అతన్ని చాకిరీనించి విముక్తుణ్ని చేస్తుంది.

అదే డప్పురాముడి రెండో కొడుకు తీవ్రవాదుల్లో పనిచేస్తుంటాడు. అతడు వచ్చి సంగతీ సందర్భము తెలుసుకోకుండా మా అన్నని పనిలోంచి తీసేశావు నీసంగతి చెప్తా అని భూస్వామిని బెదిరించి వెళ్ళిపోతాడు.

డప్పురాముడూ, భూస్వామి కూతురు గౌరీ కలిసి ప్రభుత్వం ప్రజలకిచ్చిన అనేక సదుపాయాల్ని సద్వినియోగం చేస్తుంటారు. ఉచిత పట్టాలు, వ్యవసాయ రుణాలు, పశువులు. గొర్రెలు వగైరాలు కొనుక్కోటానికి బ్యాంకురుణాలు, ఉపాధి కల్పనకోసం ఇచ్చే ఇతరరుణాలు, సబ్సిడీలు, ఎరువులు అన్నీ గ్రామస్తులకి అంద జేస్తుంటారు. గ్రామస్తులుగూడా అవన్నీ సద్వినియోగం చేసుకుంటూ అభివృద్ధిచెందు తుంటారు. హరిజనులకిగూడా కరెంటు, టెలిఫోనులాంటివి అందుబాటులోకి వస్తాయి. రుణాలు చకాచకా మంజూరై పోయి గ్రామజీవితం ప్రగతిపథంలో నడుస్తూంటుంది.

అదలావుండగా, విప్లవయోగి అనే దుష్టదుర్మార్గ క్రూరుడొకాయన తన స్వార్థప్రయోజనాలకోసం 'ప్రజాదేవత' అనే పార్టీ ఒకటి పెట్టి అక్రమంగా ధనం ఆర్జిస్తూవుంటాడు. అసలు ఈ విప్లవయోగి ముప్పయిఏళ్ళకింద ఒకనేరంచేసి పోలీసుల చేత వెంటాడబడుతుండగా విప్లవముని అనే ఆయన అతనికి ఆశ్రయమిచ్చి విప్లవ రాజకీయాలు నేర్పి పార్టీలో చేర్పిస్తాడు. కానీ విప్లవయోగి కాలక్రమంలో గురువుకే ఎగనామంపెట్టి తానొక పార్టీ పెట్టుకొని తన పార్టీ నుంచి విప్లవమునిని బహిష్కరి స్తాడు. అంతటితో విప్లవయోగి విప్లవమునుల మధ్య వైషమ్యాలు చెలరేగుతాయి.

తర్వాతజనాన్ని ఆకర్షించటంకోసం విప్లవయోగి 'ప్రజాదేవత'కు కోటిన్నొక్క తలలు బలిఇస్తే సమరాజ్యం త్వరగా వచ్చేస్తుందని అనుచరులకి చెప్పిబుకాయిస్తాడు. తన అనుచరుడైన డప్పురాముడి రెండోకొడుకులాంటి వాళ్లు తుపాకి పట్టటానికి వెన కాడటంతో వృత్తి నేరస్తుల్ని, గూండాల్నీ తన పార్టీలో చేర్చుకుని విప్లవ కార్యక్ర మాల్ని నిర్వహిస్తుంటాడు.

ఈ విప్లవ కార్యక్రమాలు ఏమిటంటే భూస్వాముల అక్రమాల్ని ప్రభుత్వ సంస్కరణలనించి రక్షించటంకోసం వాళ్ళదగ్గర లక్షలాది రూపాయలు పుచ్చుకొని వాళ్ళతరపున పనిచెయ్యటం, డబ్బివ్వని భూస్వాముల తలలు నరికి ప్రజాదేవతకి బలి ఇవ్వటం.

అలాగే ఆ పూరిభూస్వామితోగూడా ఒప్పందం చేసుకొని అతని ఆస్తికాపా డ్డంకోసం లక్ష రూపాయలు తీసుకుంటాడు. కానీ అతని అనుచరులకివేవీ తెలియవు.

నిజంగా పేదప్రజలకోసమే తమనాయకుడున్నాడని నమ్ముతుంటారు. కానీ భూస్వాములతో మిలాఖత్తై వాళ్ళని కాపాడుతున్నామనీ అందులో పావులుగా తాము ఉపయోగపడుతున్నామనీ వారికి తెలీదు.

ఐతే విప్లవయోగి ఇలా సంపాదిస్తున్న డబ్బులో తనకీ వాటా వుందని విప్లవముని డిమాండ్ చేస్తాడు. తన ఏరియాలో కార్యక్రమాలు నిర్వహిస్తున్నందుకుగాను తనకీ వసూలైన డబ్బులో వాటా ఇవ్వాలని విప్లవమునీ, జనానికి దూరమై కార్యక్రమాలు లేకుండా పోయిన నీకు నాకష్టార్జితం ఎలా ఇస్తానని విప్లవయోగీ వాదించుకుంటారు. కాట్లకుక్కల్లా పోట్లాడుకుంటారు.

ఈలోగా విప్లవయోగి దగ్గరున్న ముఖ్య అనుచరుడైన గూండా ఒకడు అతనితో విభేదించి అతన్ని అవమానించి, బెదిరించి విడిపోతాడు. అంతలోనే అతన్ని విప్లవముని చేరదీస్తాడు. ఆ గూండాని ప్రయోగించి భూస్వామి కూతురైన గౌరిని ఎత్తుకురమ్మని చెప్తాడు, దానికిగాను అతనికి యాభై వేల రూపాయలిస్తానని చెప్తాడు. ఆ గూండా గౌరిని ఎత్తుకొచ్చి యాభయివేలు ఇవ్వమంటాడు. కానీ విప్లవముని దగ్గర అంత డబ్బు వుండదు. గౌరిని అడ్డం పెట్టుకుని ఆమె తండ్రిని బ్లాక్ మెయిల్ చేస్తాడు. ఆ డబ్బు ఇచ్చాక నీకిస్తాను అని గూండాతో చెబితే ఆ గూండా విప్లవమునిని అంత డబ్బు లేనివాడివి నాతో ఎందుకు బేరం పెట్టావని హేళన చేస్తాడు. విప్లవముని గూండాని రివాల్వర్ తో చంపబోతాడు. కానీ గూండా తన ముఠాని ఒక ఈలవేసి రప్పించి తన తడాఖా విప్లవమునికి చూపుతాడు. తర్వాత ఇంత నీతిలేని నీతో నాకు పనేమిటని ఆ గూండా మర్యాదగా గౌరిని మళ్ళీ స్వస్థలానికి చేరుస్తాడు.

ప్రభుత్వం ప్రజల్ని బాగుపరుస్తున్నందువల్ల వాళ్ళు తమ మాట వినకుండా పోతే బతుకుతెరువు పోతుందని విప్లవయోగి తన అనుచరుల్ని గ్రామాలకి పంపిస్తాడు. ఆ అనుచరులు గ్రామాలు తిరిగి ప్రజల్ని భూస్వాముల దగ్గర వెట్టిచాకిరీ మానవద్దనీ, అలా మానేస్తే తమకు పాటలు రాసే వస్తువు కరువయిపోతుందనీ, అందరూ ప్రభుత్వం చెప్పినట్టు విని సుఖపడిపోతే తాము ఇంకెవడికోసం పోరాటం చెయ్యాలనీ, అందువల్ల జనం వెనకటిలాగే కష్టాల్లో వుంటే అప్పుడు తాము వాళ్ళని పోరాటం చేసి కష్టాలనించి పైకి లాగుతామనీ ప్రచారం చేస్తారు.

కానీ డప్పురాముడు తన జ్యూరిస్‌డిక్షన్‌లోని గ్రామాల్లో చైతన్యం కలిగిస్తాడు. ప్రజలకి ప్రభుత్వం ఇచ్చే రాయితీలన్నీ చెందేట్టు చూడటంతో వాళ్ళ

తీవ్రవాదుల ప్రభావంనించి తప్పించుకుని తీవ్రవాదులు వస్తే గొడ్డళ్ళతో కర్రలతో దాడిచేసి తిప్పికొట్టగలిగే స్థాయికి వస్తారు. అంతేగాక డప్పురాముడు తన పెద్దకొడుకు కులవిద్యఐన డప్పు కొట్టటాన్ని నిర్లక్ష్యం చేసినందుకు మందలిస్తాడు, ఆ సమయంలో అక్కడికి వచ్చిన పూజారిని మంత్రాలు చదవమని ఆ మంత్రాలకి తగినట్టు డప్పుకొట్టి కొడుకుకి జ్ఞానం కలిగిస్తాడు. పూజారి ఆశ్చర్యపోయి నా మంత్రాలకి నువు డప్పు కొట్టగలిగావు, పైగా మంత్రాలూ వాటి అర్థాలూ నేర్చుకున్నావు. కానీ నీలాగా నేను డప్పు కొట్టలేను. ఆ విద్య నీ సొంతం కావడం స్వార్థపరత్వం కాబట్టి డప్పుకొట్టటం నాకూ నేర్పమంటాడు. మీ విద్యవల్ల మాకు మేలు జరుగుతుంది గానీ మా విద్య వల్ల మీకేం మేలు స్వామీ అంటాడు డప్పురాముడు. విద్య ఏదైనా భగవంతుని దృష్టిలో ఒకటే అంటాడు పూజారి. డప్పురాముడు పూజారికి డప్పు కొట్టడానికి అంగీకరిస్తాడు.

ఈ కథ ఇలా వుండగా విప్లవయోగి తన అనుచరుడైన డప్పురాముడి రెండో కొడుకుని పిల్చి నీ తండ్రి మన విప్లవానికి అడ్డొస్తున్నాడు. అతడు ప్రజలకి చేస్తున్న మేలువల్ల మన మాటలెవరూ వినటంలేదు గనక అతణ్ని చంపితే మన విప్లవ కార్యక్రమం మళ్ళీ సాఫీగా సాగించవచ్చు అని పురమాయిస్తాడు. డప్పురాముడి రెండో కొడుకు తండ్రిని చంపాలని బయల్దేరి వస్తాడు.

ఇంతలో విప్లవముని తన పత్రికలో విప్లవయోగి పూర్వచరిత్ర రాసి అతన్ని బ్లాక్ మెయిల్ చేస్తాడు. చర్చలకోసం విప్లవయోగి అతణ్ని పిలిచి వెన్నుపోటు పొడిచి చంపేస్తాడు.

తండ్రిని చంపటానికి వెళ్ళిన డప్పురాముడి రెండో కొడుకు నాటకీయ సన్నివేశంలో గౌరిని చంపి పశ్చాత్తాపపడి విప్లవయోగిని పోలీసులకి పట్టివ్వటంతో మాత్రమే కాదు — తిరిగి కోదండరామస్వామి గుడిలో దైవార్చనతో నాటకం ముగుస్తుంది.

దీన్ని నాటకం అని అనటం ఎందుకంటే ఏదో ఒక పేరు ఉండాలని తప్ప ప్రాచీన ఆధునిక నాటక లక్షణాలలో ఏ ఒక్కటీ దీనికి లేదు. ఏ రీతికీ ఇది చెందదు. ఒక 'కళాప్రపూర్ణుడు' పాలిస్తున్న రాష్ట్రంలో ఏ కళావిలువలులేని ఇలాంటి నాటకం ప్రదర్శింపబడటం-ఉన్నదో లేదో తెలియని ఆ 'కళామతల్లి'కే తీరని అవమానం, మాయని మచ్చ.

ఎంత కాల్పనిక ఇతివృత్తానికైనా ఒక వాస్తవిక వాతావరణం వుండాలి. కల్పన హద్దులు దాటినపుడు కళకు వికృతి ఏర్పడుతుంది. కాశీమజిలీ కథల్లో సైతం ఊహకు ఒక పరిమితి అంటూ వుంది. ఈ నాటకంలో అలాంటి నియమాలు లేవు. విప్లవంమీద తప్పనిసరి ద్వేషం, కసీ తప్ప తాము ఏం చెబుతున్నామో ఎందుకు చెబుతున్నామో గూడా తెలియని అంధత్వంలో ఈ నాటక రచనా, ప్రదర్శనా సాగింది.

మన దేశ విముక్తి కోసం ఉద్యమం సాగించే అన్ని విప్లవగ్రూపుల్లోనూ వ్యవసాయ విప్లవం ఇరుసుగా గల జనతా ప్రజాతంత్ర విప్లవం ద్వారా మాత్రమే విముక్తి సాధించగలమన్న సైద్ధాంతిక ఏకాభిప్రాయం ఉంది. ఉన్న భేదాలల్లా గ్రూపుల ఎత్తుగడల మధ్య మాత్రమే. ఈ విభేదాన్ని ఈ నాటకంలో వ్యక్తుల మధ్య విభేదాలుగా, వైషమ్యాలుగా చిత్రించారు. సిద్ధాంతహీనులైన భావవాదులు తమలాగానే అందరూ మతాలు కలిగి ఉంటారనీ, తమలాంటి ఏకాంత రహస్య మనస్తత్వంతోనే ఆలోచిస్తారనీ అనుకుంటారు. కానీ కమ్యూనిస్టులు తమదైన ప్రాపంచిక దృక్పథాన్ని కలిగి ఉంటారు.

ఈ విషయం నాటకాన్ని రూపొందించినవారికి తెలియక కాదు. విప్లవం అనేది ఒక భౌతిక వాస్తవికతగా బలీయమైపోతున్నందువల్ల దాని అస్తిత్వాన్ని గుర్తించక తప్పటం లేదు. అలా గుర్తిస్తూనే విప్లవాన్నీ, విప్లవకారుల్నీ అప్రతిష్టపాలు చేసే ప్రయత్నమే ఇది. మూర్ఖుడు అజ్ఞానంతో చేసే సాహసం క్షంతవ్యం అవుతుంది గానీ ఉద్దేశపూర్వకంగా చేసే నిందా ప్రచారం క్షమార్హం కాదు.

విప్లవకారులు జనంలో వున్నారు. వాళ్లొక ఆశయం కోసం పనిచేస్తున్నారు. ఆ విషయం కాదనలేనంత వాస్తవంగా ముందుకు వచ్చినందువల్ల విప్లవకారులు చేసేవన్నీ అకృత్యాలుగా ప్రచారం చెయ్యటం మొదలైంది.

కొన్నిరోజుల కింద ఎన్‌కౌంటర్లు అసలు తాము చెయ్యనేలేదని పోలీసులు చెప్పేవారు. ఇప్పుడు అలా కాదు. తీవ్రవాదులు చేసే 'అరాచక చర్య'ల్ని అరికట్టడానికి ఎన్‌కౌంటర్‌లు, అరెస్టులు చేస్తున్నామని బాహాటంగానే ప్రకటిస్తున్నారు. అంటే విప్లవకారులు అనేవాళ్ళు వున్నారు, ఐతే వాళ్ళు ప్రజలకోసం పని చేస్తున్నామని బూకరిస్తూ తమ స్వార్థప్రయోజనాలు నెరవేర్చుకుంటున్నారు అని పాలకవర్గాలు ఇప్పుడు ప్రచారం చెయ్యడలుచుకున్నాయి.

అందుకే నాటకంలో విప్లవయోగి కాళీ విగ్రహాన్ని పోలిన ఒక దేవతని స్థాపించి దానికి కోటిన్నొక్క తలలు బలిస్తేగానీ ప్రజారాజ్యం రాదని చెప్పటం జరిగింది. విప్లవనాయకుణ్ణి జులాయిలాగా సిల్కు షరాయి వేసుకుని గంతులేసినట్టు చూపటం, హిస్టీరియా రోగిలాగా హుం, హుం, హుం అని వణుకుతూ మాట్లాడించటం పాత్రనీ తద్వారా విప్లవాన్ని అపహాస్యం చెయ్యటమే ఐతే రక్తి కట్టేది. కానీ అపహాస్యం కోసమని అతిశయోక్తిని ఆశ్రయించటంవల్ల తాము చెప్పదలుచుకున్న విషయమే అపహాస్యం పాలైంది.

యోగులు, మునులు అన్న భావన గూడా పాలకవర్గాలదేగానీ విప్లవకారులది కాదు. విప్లవకారులకి ప్రజలెన్నడూ 'దేవత'లు కారు. దేవత అనే భావనే మార్క్సిజానికి వ్యతిరేకం.

భూస్వాముల దగ్గర డబ్బు తీసుకుని తీవ్రవాదులు వాళ్ళ ప్రయోజనాల్ని కాపాడుతున్నారన్న విషయం గూడా పాలకవర్గాలు తమ స్వభావాన్ని తీవ్రవాదుల కంటగట్టడమే. నిజంగా ఎవరు ఎవరి ప్రయోజనాల్ని కాపాడుతున్నారు? భూస్వాముల సహాయ సహకారాలతో, వాళ్ళిచ్చే డబ్బుతో ఎన్నికల్లో గెలిచి గ్రామాల్లో వారి సాయం లేనిదే ప్రభుత్వం నడవని స్థితిలో పాలకవర్గాలు వుంటే భూస్వాములకి విప్లవకారుల మద్దతు కావాలా? ఈ ఎన్‌కౌంటర్లూ, అరెస్టులూ, అణచివేతలూ విప్లవకారులమీద ప్రయోగించేది ఎవరు? భూస్వాములకీ ప్రభుత్వానికీ అసలు తేడా ఇది అని చూపే రేఖ ఏదైనా ఉందా? పాలకవర్గ నిర్దాక్షిణ్య దమననీతిని కప్పిపుచ్చటానికి ఇలాంటి నాటకాలు సృష్టించబడటంలో ఆశ్చర్యం లేదు.

తీవ్రవాదులనే పేరు ఈనాడు దేశంలో ఎక్కడ చూసినా వినిపిస్తోంది. దీని వల్ల దేశంనిండా తీవ్రవాదం లేదా తీవ్రవాదులు వుండి సమాజ జీవనాన్ని భగ్నం చేస్తున్నారనీ అందువల్ల ప్రభుత్వానికి ఈ తీవ్రవాదాన్ని అణచటానికి ఏ అధికారమైనా ఇయ్యవచ్చుననీ పౌరులంతా భావించే స్థితి కల్పించబడుతోంది. అసలు ఏమిటి ఈ తీవ్రవాదం? ఎవరు ఈ తీవ్రవాదులు?

పాలకవర్గ ప్రశాంతతకు భంగం కలిగించే ప్రతివాడూ ఈనాడు తీవ్రవాది అవుతున్నాడు. నక్సలైట్ల దగ్గర్నించి మొదలుపెట్టి మతోన్మాది ఐన భింద్రన్‌వాలే వంటి వారిని గూడా తీవ్రవాది అని పిలుస్తున్నారు. ఐతే విప్లవకారులు విప్లవకారులే గానీ

తీవ్రవాదులు కారు. వాళ్ళు విప్లవం కోసం జీవిస్తున్నారు. విప్లవం కోసం పని చేస్తున్నారు. విప్లవం కోసం ప్రాణాలిస్తున్నారు.

మానవజాతి యొక్క భవితవ్యం రాజకీయాధికారంతో ముడిపడి వుంది. ఈ విషయాన్ని విప్లవకారులు తెగేసి చెబుతున్నారు. కానీ పాలకవర్గం ఈ విషయాన్ని దాచిపెట్టి ఆదర్శాలని ప్రబోధిస్తోంది. ఈ ఆదర్శవాద కళాప్రబోధం ఎవరికి ఏ స్వర్గాలని సృష్టిస్తుందో తెలీదుగానీ సామాన్య ప్రజానీకానికి మాత్రం కంచికచెర్ల దగ్గర మొదలై కారంచేడుదాకా సాగుతున్న నరమేధాన్ని ప్రసాదిస్తుంది. రాముడు తన రాజ్యంలో తపస్సు చేసుకుంటున్న శూద్రుడు శంబూకుణ్ని చంపినట్టు ఒక గాథ వుంది.

ఈనాడు 'సకల కళాభిరాముడు' ఎన్టీ ఆర్ పాలిస్తున్న ఈ రాష్ట్ర పాలన పదిరికుప్పంలో నరమేధంతో మొదలై మధ్యలో అశ్వమేధం జరిగి తర్వాత ఈనాడు కారంచేడులో ఏడుగురి నరమేధంతో పరాకాష్ఠనందుకున్నది. ఈ నరమేధాలన్నిటిలోనూ బలైంది 'పంచములే'. ఆ పంచముడే ఈ నాటకంలో నాయకుడు. ఇది తెలుగుదేశ పాలనకి ఉదాహరణ. హరిజనుణ్ని చంపి అంబేద్కర్‌కి దండ వెయ్యటం చాలా చిత్రం.

అసాధారణమైన అజ్ఞానంతో సృష్టించబడిన ఈ నాటకంలో ఒక విచిత్రమైన లక్షణం వుంది. అది మన పురాణాల్లో వున్న నరసింహస్వామిలాగా ఇటు మనిషీ కాదు అటు మృగమూ కాదు.

ఎలాగంటే డప్పురాముడు అనేవాడు ఊరిని ఉద్ధరించటానికి పూనుకుంటే ఆ వూరి భూస్వామి అడ్డుకుంటాడట. ఆ భూస్వామికి మద్దతుగా తీవ్రవాదులు నిలిచి డప్పురాముణ్ని వ్యతిరేకిస్తారట! ఇదే నిజమైతే - భూస్వాములకి తీవ్రవాదుల మద్దతు వుండి ప్రభుత్వంనించి భయమే వుండి వుంటే - ప్రభుత్వం ఆ భూస్వాములకి పోలీస్ గార్డుల్ని ఇచ్చి ఎందుకు కాపాడుతోంది? భూస్వాములు తీవ్రవాదుల్ని చంపటానికి బి జె పి, ఎ బి వి పి లాంటి కాపాలికుల ముఠాల్లో చేరి ఎందుకు వాటిని ప్రోత్సహిస్తున్నారు? తెలుగుదేశం పార్టీ భూస్వాములకి వ్యతిరేకమనీ కూలీలకి సన్నిహితమనీ చెప్పదలిస్తే 'ప్రభుత్వ సమాచారశాఖ'కి అభ్యంతరం లేకపోవచ్చుగానీ స్వయంగా సాటిలేని భూస్వామీ, ధనస్వామీ, అధికారస్వామీ ఐన ఆ పార్టీ నాయకుణ్ని గూర్చి తెలిసి గూడా పంది ముట్టెమీద భూభారాన్ని మోసినట్టు అంత పెద్ద అబద్ధాన్ని ఈ నాటక రచయిత మోయదలుచుకున్నాడా?

ఇంకో అసందర్భం ఏమిటంటే విప్లవకారులు హింస సాగిస్తున్నారనేది. కానీ అసలు సంగతేమంటే పాలకులు ఎప్పుడయితే సమాజం మీద హింసను రుద్దుతున్నారో అప్పుడే ప్రతిహింసకు దారి ఏర్పరుస్తున్నారని అర్థం. ఐతే హింసను ప్రయోగించకుండా ఏ పాలకులూ ఉండరు. ఉండటానికి వీల్లేదు. అణచివేత దగ్గర్నించి మొదలుపెట్టి అసత్య ప్రచారందాకా ఈ హింసా విధానం కొనసాగుతుంది. కానీ హింస ఎప్పుడూ ప్రతి హింసకి దారి తీసి పాలక వర్గ వినాశనాన్ని సాధిస్తుంది. అది చరిత్ర సత్యం.

తీవ్రవాదులు గూండాల్ని చేరదీసి పనులు నెరవేర్చుకుంటున్నారని ఒక ఆరోపణ. మూడువందల యాభయిమంది శ్రీకాకుళ అమర వీరుల్నించి నిన్న మొన్న బూటకపు ఎన్‌కౌంటర్ చెయ్యబడ్డ భూపతి రెడ్డి దాకా తీవ్రవాదుల్లో ఎవరు గూండాలు? ఈ ప్రశ్నకి మన ప్రభుత్వ యంత్రాంగం జవాబు చెప్పగలదా ?

ఇదంతా ఇలావుంచి నాటకంలో చూపినట్టు తమ ప్రభుత్వం అంతవేగంగా అట్టడుగు ప్రజలదాకా తమ సంక్షేమ పథకాల్ని తీసుకుపోగలుగుతోందా ? ప్రజలు ఉద్యమించి తమ విశ్వాసాలకు అనుగుణమైన పాలనా విధానం ఏర్పరచుకోగలరు గానీ పాలక వర్గాలు ఆ పని చెయ్యగలవా ?

పాలక వర్గాలు చేసేపని తమ సంస్కృతిని ప్రజల్లో స్థాపించటమే. అందువల్లనే ఈ నాటకంలో పూజారి మంత్రాలకి హరిజనుడు డప్పుకొట్టటం జరిగింది. పూజారి హరిజనుడికి మంత్రాలు నేర్పటం అవి నేర్చుకుని గొప్పజ్ఞానాన్ని పొందానను కోవటం ప్రజల్ని తప్పుదారి పట్టించే పాలక వర్గాల కుట్రలో భాగం.

అసలు ఈ నాటకంలోని సందర్భాలు ఇన్నీ అన్నీకావు. ఈ నాటక కథని ఒక క్రమంలో రాయటానికే చాలా శ్రమ పడాలి. పాత్రధారులంతా డైలాగులు అప్ప చెప్పటమే కానీ వాటి అర్థం ఆలోచించినట్టు కనిపించదు. చవకబారు జోకులు, వెకిలి మాటలు లెక్కలేనన్ని ఉన్నాయి.

నాయకుణ్ణి ఎంతగొప్పగా చూపాలనుకుంటే ప్రతినాయకుణ్ణి అంత గొప్పగా చిత్రించాలన్న కనీసజ్ఞానం గూడా ఈ రిపర్టరీలోని రచయితకిలేదు, దర్శకుడికి అంతకీ లేదు. సాంకేతిక దృష్టితో చూసినా ఈ నాటకం భారతి నాటకం కన్న నేలబారులో వుంది. దానిక్కారణం చెప్పదలచుకున్న విషయం మీద నైతిక ధైర్యం లేకపోవటం.

కేవలం ఒకే ఒక చిన్న ప్రశ్నలో ఈ నాటక సమీక్షని ముగించవచ్చు.

ఈ రిపర్టరీతో పనిచేసే వాళ్లంతా అదృష్టవంతులనీ, ఎన్‌కౌంటర్లకన్న ఈ 'కల్చరల్ ఎన్‌కౌంటర్లే' చాలా అవసరమనీ రామభక్తాంజనేయులొకాయన గంతులేశాడు.

వాళ్ల అదృష్టమంతా పోలీసుదొరల కనుసన్నలో మెలగటంలో ఉంది. అలా మెదలటానికి ఇష్టపడని ఒక నటి ఎందుకు ఆత్మహత్య చేసుకుందో సెలవిస్తారా ఎవరైనా ?

— ప్రేక్షకుడు

# పంజాబ్ - కవితా ప్రతిస్పందన

"ఆపరేషన్ బ్లూస్టార్" సైనికచర్య పంజాబ్‌పై బడి సంవత్సరం గడచి పోయింది. అపును ఇది అమృత్‌సర్‌పై కాదు. స్వర్ణమందిరంపై అంతకన్నా కాదు. అది గ్రామీణ పంజాబ్‌పై సైనిక చర్య. ప్రజలు తమ పాటలు, నాటకాలా ఇతర ప్రజా కళారూపాలూ, వాటికి ఆలంబనమైన పోరాటాల ద్వారా ఏ సంప్రదాయ ప్రవాహం పంజాబ్‌లో నిరోధింపబడగూడదని ప్రయత్నిస్తుంటే కేంద్ర ప్రభుత్వం కర్ఫ్యూ బారికేడ్ కట్టి డెబ్బై వేల సైన్యం రూపంలో పన్నెండువేల గ్రామాల్లోకి హింసా దౌర్జన్యాలను ప్రవహింప చేసి పన్నెండునెలలు గడిచిపోయింది. పంజాబ్ నదుల నెత్తుటి గాయాలింకా పచ్చిగానే ఉన్నాయి. అవమానంతో, అనుమానంతో, క్రోధంతో ఎర్రబడ్డ పంజాబ్ మొహమింకా నఖగురిలో నవ్వుతూ మసలుకోవడం లేదు. రజాకార్ల నెపంతో హైదరాబాద్ సంస్థానంలో ప్రవేశించిన నెహ్రూ సైన్యాలు ఏ స్వప్న గృహాలను కూల్చివేశాయో, టెర్రరిస్టుల నెపంతో పంజాబ్‌లో ప్రవేశించిన ఇందిరా సైన్యాలు సిక్కుల చక్కటి దారుల్లో ఆ విషాన్నే చిలికాయి. ఆమె చచ్చి ఆ విషాన్ని ఢిల్లీ నుంచి పల్లెదాక ఎల్లెడలా వెదజల్లింది. కళ్ళల్లో టెలివిజన్ ఆ విషాన్ని చల్లుతున్నది. చెవుల్లో రేడియో ఆ విషాన్ని కరిగించి పోస్తున్నది. మనుషుల మనసుల్ని ఆ విషం కలుషితం చేస్తున్నది. ఈ విష సంస్కృతికి విరుగుడుగా పంజాబ్‌లో, బయటా సాహిత్య సాంస్కృతిక ప్రతిఘటన ఉందా ? ఉంటే ఏ మేరకు అనే అన్వేషణలో భాగంగానే మూడు కవితలందిస్తున్నాం.

రెండు హిందీలో కుమార్‌వికల్ కవితలు. ఒకటి మలయాళంలో సచ్చిదా నందన్ కవిత.

నక్సల్బరీ, శ్రీకాకుళ ఉద్యమాల ఉత్తేజంతో 1969లోనే శ్రీకాకుళంపై విజయ కుమార్ పేరుతో [సూర్యుడు - సృజన ఫిబ్రవరి] కవితలు రాసిన హిందీ కోపోద్రిక్త కవి కుమార్‌వికల్. ఇంకా నలభై ఏళ్ళు నిండని, పంజాబ్‌కు చెందిన ఈ హిందీ కవి ఇదివరలో రావల్పిండిలో ఉండేవాడు. ఇప్పుడు ఛండీగఢ్ విశ్వవిద్యాలయంలో పనిచేస్తున్నాడు. సుప్రసిద్ధ హిందీకవి ముక్తిబోధ్ రోగాన్ని విశ్లేషించడం మాత్రమే చేసాడని పరిష్కారం కోరుతున్న వికల్ మావోయిస్టు అయ్యాడు. ఆయన హిందీ కవితాసంకలనం 'ఏక్ ఛోటీసే లఢాయి' హిందీ కవిత్వంలో ఒక మైలురాయి.

సుప్రసిద్ధ మలయాళ కవి సచ్చిదానందన్ సృజన పాఠకులకు చిరపరిచితుడు.

—సాహితీ మిత్రులు

# గుర్తింపు

వీధిలో ప్రవహిస్తున్న రక్తాన్ని
వాసన చూసి గుర్తించడానికి ప్రయత్నించు
అది హిందువుదా ముస్లిందా
సిక్కుదా క్రైస్తవుడిదా
సోదరునిదా సోదరిదా
వీధిలో వెదజల్లిన రాళ్ళమధ్య
పడి ఉన్న టిఫిన్ డబ్బా
దానిలోంచి తొంగి చూస్తున్న రొట్టె
ఏ కులం వాసనేస్తున్నది ?
నెత్తురంటిన దుస్తులు, తెగిన చెప్పులు
విరిగిన సైకిళ్ళు, పుస్తకాలు, బొమ్మలు
వీటిదేజాతో చెప్పగలవా ?
బడి నుంచి ఇంకెప్పుడూ ఇంటికి తిరిగిరాని
బిడ్డ కోసం తల్లి పెట్టే కన్నీళ్ళు
ఆసుపత్రిలో క్షతగాత్రుని
మూలుగుల్లోని బాధ
వీటి మతమేమిటో నువ్వు నాకు చెప్పగలవా ?
అవును నేనీ రక్తం గురించి చెప్పగలను
ఆ టిఫిన్‌లో రొట్టె ఏ మనిషిదో
ఇంటి నుంచి ఆఫీసుకు సైకిలు తొక్కుతూ
ఎవరి స్వప్నాలు ఫైళ్ళలో సమాధి అయ్యాయో
ఆ జాతిది ఆ రక్తం
ఎవరి చేతులు మిల్లులో బట్టలు నేస్తాయో
ఫ్యాక్టరీలో చెప్పులు చేస్తాయో
పొలాల్లో విత్తనాలు చల్లుతాయో
పుస్తకాలు రాస్తాయో, బొమ్మలు చేస్తాయో
వీధుల్లో దీపాలు వెలిగిస్తాయో

ఆ మనిషివి ఆ రక్త సిక్త వస్త్రాలు
నేను సైతం దీపాలను వెలిగించగలను.
కాని
బడినుంచి ఇంటికి తిరిగిరాని
కూతురు కోసం కన్నతల్లి పెట్టుకున్న
కన్నీళ్ళ మతమేమిటో నీకు చెప్పలేను
అట్లే క్షతగాత్రుల గాయాలపై మందు పూయగలను
కాని వాళ్ళ నిట్టూర్పుల్లోని బాధను చెప్పలేను.

## ఆమె వేదన గురించి ఒక గీతం

పంజాబీ స్త్రీలకు అంకితం

మొదటిసారి
వాళ్ళు నా వీపు మీద
ఎర్రగా కాలిన ఇనుముతో
నిప్పుల భాషలో
ఏ ప్రపంచ పటంలో
వెతికినా దొరకని
ఒక దేశం పేరు చెక్కారు

రెండవసారి
వాళ్ళు కర్ఫ్యూ చీకట్లో
నా శరీరం మీద కవాతు చేస్తూ
సైనిక భేరీ మోగిస్తూ వచ్చారు.

ఇది ఏ పుణ్యక్షేత్రమో
ఎవరికి ఎంత పవిత్రమో
ఎంత బాగా ప్రేమించబడిందో
నాకు తెలియదు
ప్రతిసారీ
నా శరీరం లోని మాంసం

పదఘట్టనలో నలిగిపోవడం
మాత్రం నాకు తెలుసు

మూడవసారి
నేను కాందిశీకుల శిబిరంలో ఉన్నాను
నేనిక్కడికి ఏం చూడడానికి వచ్చాను ....
నా దేహాన్నా ?
వాకిట్లో
నా స్వప్న ఫలాలనూ
ఆనందగీతాలను పాడుతూ కదిలే
నా చిన్నారి పిచ్చుక పింఛానూ మోస్తున్న
రెండు లేత మొక్కల్ని నాటుకున్న
నా ఇంటినా ?
కాందిశీకుల శిబిరాల్లో
కలల లోగిళ్ళు లేవు
కాందిశీకుల శిబిరాలలో
వెక్కి వెక్కి ఏడుస్తున్న శిధిలాలున్నాయి
కాలి పోయిన చెట్లున్నాయి
తెగిపడిన పిచ్చుకల రెక్కలున్నాయి
సగం పిచ్చెక్కిన స్త్రీ
సైనిక భేరీకి లయ కలుపుతూ
కర్ఫ్యూ చీకటిని చీలుస్తూ
వేస్తున్న వెర్రి కేక ఉంది
నాకే దేశమూ అక్కరలేదు
ఏ పుణ్య ప్రదేశమూ వద్దు
ఏ మత స్థలమూ వద్దు
విశాలమైన ఈ భూమి మీద
ఒక శకలం పై నిర్మించిన
నా చిట్టి పొట్టి కలల బొమ్మరిల్లును
నాకు తిరిగి ఇవ్వండి

[ ఇంగ్లీషు అనువాదం నిరుపమాదత్ ]

# పంజాబ్‌లో రాత్రి

సచ్చిదానందన్

మేం ముగ్గురమే మేల్కొని ఉన్నాం
అర్థ చంద్రుడు వెలుగుతున్నాడు
మనస్సు నిద్రపోయింది
శరీరమే మేల్కొని ఉంది
మేం ముగ్గురమూ మాకు ప్రియమైన వాళ్ళ నుంచి
వేరు చేయబడ్డాం.
మా కన్నీళ్ళు ఖర్చయి పోయినయ్ గనుక
సారా తాగుతున్నాం
భాష ఇంకి పోయింది గనుక
నిశ్శబ్దాన్ని తాగుతున్నాం
రెండు సరస్సుల మధ్య బంధించబడ్డ
మూడు ద్వీపాలకు
ఈ మాత్రం చంద్రుడు చాలు
ఈ సంగీత బంధం నుంచి
విశృంఖల రక్తంలోకి
దయచేసి మమ్మల్ని విముక్తి చేయకండి
ఇప్పటికీ
వెన్నెల విందు భోజనపు బల్లలపై
గోండు తుడుం శబ్దాలు విరుచుకపడ్డట్లు
మా నిద్రల్ని ఒక పీడకల
చెదర గొడుతుంది
పంజాబ్ అయిదు నదులూ
నెత్తుట్లోకి మారిపోయినవి
ఆరవదీ హృదయంలోంచి ప్రవహించేదీ
ఎంతోకాలం కిందనే ఎండిపోయింది
తగులబెట్టబడిన ఇంట్లో
ఇక్కడ మేం సగం కాలిన
అతిథులం మాత్రమే.

[ ఇంగ్లీషు అనువాదం - ఎ వి ఎస్ నంబూదిరి ]

అనువాద కవిత :

# గాయపడిన సూర్యుడు కళ్ళు తెరిచినపుడు

ఆదిల్ మన్సూరి

గాయపడిన సూర్యుడు కళ్ళు తెరిచినపుడు
చురకత్తుల తళతళలకు ఆయన కళ్ళు మూసుకుపోయాయి.
అవిశ్వాసపు మేఘాలు గర్జించాయి;
మేం ఇళ్ళలోంచి బైటికి అడుగు పెట్టగానే
మా ఇళ్ళు డీఉడ్చుకుపోయాయి.
మనసునూ శరీరాన్నీ కలిపి ఉంచిన బంధం తెంచేయబడింది.
ప్రార్థన కోసం ఎత్తిన హస్తాలు తెగనరకబడ్డాయి.
రక్త సంబంధాలు బూడిద కుప్పలుగా మారిపోయాయి
పరిచయాల పదాల మీద ఆ బూడిద కప్పుకుపోయింది.
అనిశ్చితస్థలాలను గుర్తించడం కష్టమైపోయింది:
సుదూర దిగంతం మీద మంటలు రేగాయి
అంధకార శరీరంలోంచి దూసుకొస్తున్న మహాగ్ని
రహదార్ల మీద లెక్కలేనన్ని చీమలు అణగదొక్కబడ్డాయి
విచలితమైన పావురం కిటికీ మీద కూచుని తన స్వరానికి తానే భయ
పడింది.

ఇప్పుడిక నేలలూ లేవు, వాటి మధ్య గోడలూ లేవు
నీ పాదాలు ఆనించడానికి భూమి మీద స్థలమే లేదు
ఎండమావుల్లో కన్నీళ్ళు నింపుకో
వలస అరణ్యాలకు నీళ్ళు ప్రవహింపజేసుకో.

[మతోన్మాద హింస గురించి ఆదిల్ మన్సూరి ఉర్దూలో రాసిన కవితకి అయిన్ రషీద్, ప్రీతిష్ నంది ఇంగ్లీషులోకి అనువదించారు. ఆదిల్ మన్సూరి ఉర్దూలోనూ, గుజరాతీలోనూ సుప్రసిద్ధ కవి.]

## అడవినెలబాలుడు

మడావి

కామ్రేడ్
కలిగినోళ్ళ చేతుల్లో వున్న
భూములు, అడవులు, ఆవులు, మేకలు, గొర్లు ఒకటేమిటి
బంధనాలు తెంచుకొని
బక్కపల్చటోళ్ళ చేతుల్లో కొచ్చినప్పుడు
వెలుగుతున్న ఆ కళ్ళల్లోని వెలుగును పంచుకున్నాం
నిర్బంధాలు చుట్టుముట్టి
మనలను మట్టుబెట్టాలని
చూసిన ఆ కోరల్లోనుంచి
కాపాడిన గుడిసెలు
గుండెల్లో దాచుకున్న గుడిసెల్లోని జనం
అప్పుడూ మనం ప్రజల్లోనే వున్నాం
వచ్చిన మీ వూరి నుండి అయిదుగుర్లో
ముగ్గురు తిరోగమన మార్గం పట్టినపుడు
మరో కామ్రేడ్ రాజలింగం ఆశయసాధనలో అంకితమైతే
మిగిలిందొక్కణ్ణని నిరాశ చెందలేదు గదా
పోయినోళ్ళను విమర్శించింది
అమరుని ఆశయానికి అంకితమైంది నువ్వే
రేపటిపై నమ్మకంతో వున్నది మనం
సాంఘికమైన ఇబ్బందులు ఎదుర్కొనపుడు
సమాజంలో దాని మూలాన్ని
కనుగొనే ప్రయత్నం చేసావే గానీ
రెచ్చి పోలేదు గదా
జగిత్యాల జైగంటలు మోగిందన్నప్పుడు
ఆ మోగించిన వాళ్ళలో
మనమూ వున్నాము
ఉప్పు మడిగెలో ఉప్పెన లేచిందన్నప్పుడు
అ ఉప్పెనను ఊది లేపినవాళ్ళల్లో మనమూ వున్నాము
జగిత్యాలే కాదు
జగత్తునే మోగించాలని మనం అనాడే గ్రహించాం గదా !
విప్లవకారునికి ఎల్లలు లేవని
మరోసారి రుజువు పరచింది నీవు

నిర్దేశించిన పనిని నిర్మోహమాటంగా నిర్వహించింది నీవు
జగిత్యాలంటే, మహాదేవ్‌పూరంటే, మహారాష్ట్రంటే, మధ్యప్రదేశ్ అంటె
ఎక్కడైతేనేం
ముందు కొచ్చినోళ్ళము మనమే గదా !
క్రామేడ్ బాలన్నా
నీ మరణ వార్త విని నిరాశచెందడం లేదు
అంతగా బాధపడడమూ లేదు
నేనంత కంటె
బాధపడుతున్నది
నిన్ను
బలిగొన్న ఈ బందూక్ వ్యవస్థనెప్పుడు
బలిపెట్టుతాననే
అందుకే నా చేతిలోని బందూకు దించకుండా
మరింత సూటిగా ఎక్కుపెట్టుతానని
ఈ సమయంలో మరోసారి
ప్రతిజ్ఞ చేస్తున్నా.

(మధ్యప్రదేశ్, నారాయణపూర్ తాలూకా తాడోబైవ్ గ్రామంలో మార్చి 6న పోలీసు కాల్పులకు గురై అమరుడైన కామ్రేడ్ బాలన్న (గణపతి) స్మృతి కోసం)

---

సమీక్ష :

# ఒంటరి సామాజికుడు : శివారెడ్డి 'భారమితి'

మానవ సమాజ గతిలో విప్లవానికి ప్రాధాన్యత వచ్చిన నాటి నుంచీ కవులు రకరకాలుగా దానికి ప్రతిస్పందిస్తూనే ఉన్నారు. ఆలోచననీ, ఆచరణనీ నిర్దేశించగల సామాజిక కారణాలు మనిషిని తాను ఉన్న స్థితి నుంచి మార్పు కోసం నడిపిస్తున్నాయి. తన స్వభావంలోనే ఉన్న జిజ్ఞాస కలిగి ఆసక్తినీ ఆవేశాన్ని కలిగిస్తోంది. వ్యక్తిగత చైతన్యంలా కవుల్లో కన్పించే ఈ సార్వత్రిక చైతన్యం పూర్వ శక్తుల్ని తోసేసి సాధారణ ధోరణికి పూర్తిగా భిన్నమైన ఒక నూతన దృక్పథానికి దారి తీస్తుంది. ఒక విజ్ఞానం మీద విశ్వాసం కలిగి ఉన్నానని చెప్పటానికి – అది 'లోక రీతి'కి విరుద్ధమైనదైనప్పుడు – మనిషికి చాలా ధైర్యసాహసాలు కావాలి. దాన్ని అక్షరాల్లో ప్రకటించటానికి మరింత ధైర్యం ఉండాలి. "పోరాటమే జీవన సూత్రంగా బతుకుతున్న – మనిషి – చూపులే ఆయుధాలు – చేతులే ఆయుధాలు" అంటున్న శివారెడ్డిని ఆ రకంగా చూడాలి.

మన చుట్టూ ఉండే సామాజిక వ్యవహారాల్ని ఏ మాత్రం ఆలోచించకుండా రేషను బియ్యం క్యూలమీదో, రిక్షా కార్మికుడి మీదో ఒక్క గేయం గిలికి సమాజానికి అద్దం పట్టామనుకునే పిల్లకారు కవుల్నించి ధీర గంభీర వచోనిధులైన బృహత్కవుల దాకా సర్వదా ఒక విషయం మరిచిపోతున్నారు. అది కవిత్వం అని తాము లేబిల్ తగిలిస్తున్న సరుకులో కవిత్వాంశ లేశమైనా వుండాలన్నది కనీస జ్ఞానం. అయితే ఈ కవితామయ వ్యవహారాల్లో మనిషికి నిర్లిప్త శైత్య తత్వం అలవాటు చేసేవాళ్లూ, ఉన్మత్త తృష్ణతో వంచనాత్మక విలువల్ని చాటే వాళ్లూ, ఓటి మోతలు చేస్తూ ఏవో పాత లోకాలని కళ్ళకి కట్టించే వాళ్లూ ఉంటారు. వీళ్ళ భౌతిక పునాది ఏమిటన్న ప్రశ్న మీద ఆ కవిత్వ ప్రయోజనం ఆధారపడి ఉంటుంది. ఆ కవులు తమ సాహిత్యం ద్వారా ఏ విలువల్ని ప్రతిపాదిస్తున్నారో అర్థమైతే కానీ ఆ కవిత్వం అర్థం కాదు. రాకెట్లో విహరిస్తూ గడియారంలో టయిం చూసుకుని గాయత్రీ మంత్రం జపించేవాడి అజ్ఞానం మనకి నవ్వుకోవటానికి తప్ప మరి దేనికీ పనికిరాదు. కవిత్వం అంటే సమ కాలీన జీవన పోరాట ప్రతిఫలనం.

ఒక సమాజంలో, ఒక అభివృద్ధి చెందిన ఆధునిక నాగరికత మధ్య నివసిస్తూ ఎవడైనా ఆధునిక సాహిత్యాన్ని నిరసిస్తున్నాడంటే వాడికి ఆ సమాజ స్వభావం

అర్థం కాలేదని అర్థం. వాడు ఈ భౌతిక పరిస్థితుల ప్రభావం తన మీద లేదని భ్రమిస్తున్నాడన్నమాట. ఇలాంటి వాళ్ళు కవుల్లోనూ ఉంటారు. ఉండటమే కాక అరువు తెచ్చుకున్న ఔన్నత్యంతో స్వాతిశయ పూరితమైన రచనలు చేస్తుంటారు.

కానీ సమాజ స్వరూపం అర్థమైన వాడు ఏ వికృత విలువల్నీ మన మీద రుద్దకుండా నిర్దిష్టమైన రూపాన్ని, నవ్యతనీ కవిత్వంలో ప్రదర్శిస్తాడు. శివారెడ్డే 'ఆసుపత్రి గీతం'లో రాసినట్టు

"చీమలు స్వర్గాన్ని జుట్టు పట్టుకు లాక్కొచ్చి
బజార్లో తలలు నరికేస్తుంటే
హత్య చేయబడ్డ సమాధులన్నీ
ఆనందంతో చప్పట్లు ......." కొడుతుంటే ఆ ధ్వనిని అక్షరాలుగా మార్చటమే, శబ్దానికి రూపం ఇవ్వటమే ఈ నాటి కవి బనవాడి పని. శివారెడ్డి కవితావేశువ సూర్యుని కిరణాలు దశాబ్దంన్నరనించీ ఆసుపత్రి గీతాల నేత్ర ధనుస్సుగా పరిణతి చెంది ఈనాడు 'భారమితి'గా నిలబడ్డానికి ఒక క్రమం ఉంది. అది సాధారణంగా అతని కవిత్వంలో కనిపించే శబ్ద, రూపాల కొత్తదనమే కాక ఆయన పరిపక్వత గూడా.

కవిత్వంలో బలం, నిండుతనం ఉండాలంటే దాన్లో జీవం ఉండాలి. ఒక పుస్తకం చదివి ఎవడూ మరో పుస్తకం రాయలేడు. శివారెడ్డి కవిత్వానికి అతని అంతులేని భావుకత, చాతుర్యం తోడయినాయి. భావానికీ, చేతలకీ మధ్య సజీవ సంబంధం ఉంటేనే మనిషికి అస్తిత్వం ఉన్నట్లు కవిత్వం గూడా మానవుని భౌతిక అనుభవాల అనువాదమే కనుక దానికీ భౌతిక పునాది అవసరం. మానవత్వం యొక్క లక్షణం సమాజం నించి తాను గ్రహించిన జ్ఞానాన్ని తిరిగి దానికి భద్రంగా అప్పగించటమే.

"కళ్ళల్లో సూర్యుడు కదలాడని వాడు ప్రపంచాన్ని స్పృశించలేడు". సమాజం ఏం కోరుతున్నదో శివారెడ్డికి తెలుసు.

"ఒక మాట పగిలి
రెండో మాట జన్మించే లోపల మిగిలే నిశ్శబ్దాన్ని కూడా భరించలేను"
అనటం వల్ల వైరుధ్యాల వేగత కూడా అతడికి అర్థమై ఉండాలి. తాను శబ్దాన్ని

అని ప్రకటించి ఆ శబ్దం మట్టిపెళ్ళను విరిచే పలుగు చేస్తున్న క్రియాత్మక శబ్దమని విశ్లేషించటంతో తన ధ్వని తత్వాన్ని మాత్రమే కాక తన తత్వాన్నీ వివరిస్తున్నాడు.

శ్రమనించి పుట్టిన శబ్దమే శతాబ్దాల తరబడి సాగిన మానవ నాగరికతలో సాహిత్యమైంది. ఏనాడో పరాయీకరింపబడ్డ సాహిత్యం ఈనాడు తన జన్మ స్థలాన్ని గుర్తు చేసుకుంటోంది. అందువల్ల ఈ నాటి సాహిత్యం నాగలికర్రు భూమిని చీలుస్తూ సాగిపోయే మోహన 'రూప' శబ్దం కూడా అవుతోంది. ఇలాంటి ప్రయోగాల వల్ల శివారెడ్డిలో సాంప్రదాయికత కనిపిస్తుంది. కానీ ఆ సాంప్రదాయకతని అతడు తిరగేసి చూపుతున్నాడు.

శివారెడ్డిది ఒక ప్రత్యేక కంఠం. ఉదాహరణకి వీణ అనే సాంప్రదాయక వాయిద్యాన్ని పట్టుకుని "కదలనివీణ రోడ్డు" అన్నాడు. వీణ కదులుతుందా పలుకు తుంది గాని ! కదిలేది రోడ్డు. కానీ పోలిక వల్ల వీణ కదిలే వస్తువే అనే భ్రమ కలిగించాడు. నిజానికి రోడ్డూ, వీణా రెండూ కదలనివే. ముందు రోలరు నడిచి పోతుంటే వెనక కావ్యం రూపుదిద్దుకుంటుందనటం, చదువు రాని మాలకొండాయ్ చేతుల్నిండా పాటలే అనటం అతని రూప వైచిత్రికి చిహ్నం. శివారెడ్డిలో ఈ లక్షణం దండిగా కన్పిస్తుంది.

సమాజ స్వరూపం, దాని గమనం, లక్ష్యం మారినపుడు సాహిత్యకుల అభి వ్యక్తుల్లోనూ మార్పు రాక తప్పదు. ప్రస్తుత కాలంలో నఽస్కృతి ఒక ఉద్యమంగా సాగుతోంది గనుక ఉద్యమానికి అవసరమైన వేగం, స్పష్టత గూడా సంస్కృతి లోనూ, దానిలో భాగమైన సాహిత్యంలోనూ ఉండి తీరాలి. ఐతే ఈ స్పష్టత విష యంలో శివారెడ్డి కొంత వెనకబడి ఉన్నాడు. ఆధునిక యుగంలో మనం మార్పుకి గురవటమే కాకుండా మార్పుని ఆహ్వానిస్తూనే ఉన్నాం. కళకు నిజమైన పునాది, కేంద్రం, నిజమైన జీవం ఈ పాటికే ఏర్పడి ఉండగా ఇంకా అర్థ, రూప వైచిత్ర్యాల నరుగుడు చెట్ల చుట్టూ తిరగటం మంచిది కాదు.

"నిలబడీ, నిలబడీ, నిలబడీ - లబడీ–" అన్నచగ్గర శివారెడ్డి నిలబడి వుండటంలో గల దీర్ఘతని సూచించాడు. చాలా కాలంగానో, సేపట్నించో నిలబడి ఉండటమని కవి అర్థం. కానీ అది వెకిలిగా మారింది. పదప్రయోగాలతో రూపసాధన చెయ్యటం కవిత్వంలో కొత్తకాదుగానీ అది పూర్తిగా సాధించబడాలి. తిలక్ 'ముసలివాడు' గేయంలో ఈ సాధన కన్పిస్తుంది. కర్ర పట్టుకుని తడబడుతూ నడిచే

ముసలివాని నడకలాగే కవితలోని పదాల కూర్పూ, నడకా సాగుతుంది. పదాల నడక కవిత్వంలో దృశ్యాన్ని గూడా సృష్టించటంతో పాఠకుల్ని ప్రభావితం చేస్తాయి. అయితే ఇదంతా ప్రయోగపరత్వమే అనటం గూడా తప్పు. లక్ష్య ప్రధానమైన ప్రయోగాలు తప్పుకాదు. కానీ ప్రయోగలక్ష్యం ప్రయోగమే కారాదు. ప్రయోగంలో వస్తు ప్రయోజనం బలికాకూడదు. ఐతే అలా అయే అవకాశమే ఎక్కువగా వుంటుంది.

మనిషి అస్తిత్వానికి కొన్ని ప్రకృతి శక్తులు మూలం. అతనికీ తక్కిన జీవ జాలానికీ గల భేదం మేధస్సు అన్నది ఏనాడో స్పష్టం. కాగా అతనికి స్వయంనిర్ణయ శక్తి ఉందన్నది దాన్నుంచి విడదీయరాని అంశం. ఈ స్వయంనిర్ణయశక్తివల్ల మనిషి అప్పుడప్పుడూ కొన్ని పొరపాట్లు చేస్తాడు. ఐతే పొరపాట్లకి లోనుగాని జ్ఞానం లోకంలో ఏదీ లేదు.

'శరణ్యం' కవితలో భావం మంచిదే ఐనప్పటికీ పదాలు కొన్ని కవి భావానికి వ్యతిరేకంగా వున్నాయి. ఆయుధానికర్పించుకోవటం, గది ఊయల కావటం, అరణ్యం శరణ్యం వంటి పదాలు ప్రయోజనంతో విడివడిన స్వభావం గల ప్రయోగాలు.

'సర్ప పంజరం' అనటం ఒక చమత్కారం. పాములతో తయారైన పంజరం అనేది ఒక అర్థంకాగా పాముల్ని బంధించటానికి పంజరమని మరో అర్థం. సర్పానికి బుట్ట కావాలిగానీ పంజరం కాదు. పంజరంలోని పాము సులభంగా జారుకోగలదు. మతకల్లోలాల సర్పానికి పంజరం కూర్చారని కవి గౌణార్థంలో చెపుతున్నాడు. ఐతే ఒక విషయం స్పష్టం చేస్తున్నాడు.

"హత్య చేయబడ్డ చిన్నపిల్లాడి కత్తిగాటు నుండి
వీస్తున్న ఒక లేజర్ నీలికిరణం ఇరు స్వర్గాల్ని
తప్పక ఖూనీ చేస్తుంది"

నిజమే కావచ్చుగానీ ఆ పిల్లాడికి కత్తిగాటు తగలకుండా వుండే మార్గం లేదా? ఉంది.

"వర్షం వస్తున్న అలికిడి
ఈ సాయంకాలం ఏ అడవిమీదో ప్రశాంతంగా కురుస్తున్న
వర్షం వస్తున్న అలికిడి
తప్పదు వర్షాన్ని ఆహ్వానించాల్సిందే
నీ రాక్తాన్ని కడిగేందుకు
తప్పదు - వర్షాన్ని ఆహ్వానించాల్సిందే".

కవికి అన్నీ తెలుసు, అంతా తెలుసు అనటానికి ఈలైన్లేకాదు ఇంకెన్నిలైన్లయినా ఉదహరించవచ్చు. కానీ తన కవిత్వంలో కొంత గోప్యతని ఈ కవి ఎందుకు పోషిస్తున్నాడు అని అనుమానం వచ్చేచోట్లున్నాయి. "గుండె" "ఒక సెప్టెంబరు రాత్రి" వంటి కవితల్లో చెప్పిన విషయాన్ని స్పష్టంగా చెప్పిఉండవచ్చు. నిజానికి శివారెడ్డి అనేక కవితల్లో ఇలాంటి అసందర్భాలు చాలా ఉంటాయి.

అంతేకాక ఒక"యూథ్యర్థా"నికి అనేక వ్యాఖ్యానాలు చెయ్యటం గూడా అతని అలవాటు. "రాత్రి" కవితలో 'రాత్రికీ అర్థముంటుంది' అని ప్రారంభించి రాత్రికూడా, రాత్రంటే, రాత్రి - అని వాక్యాల మొదళ్ళని ప్రారంభించి నలభై ఏడు (లైన్ల) అర్థాల్ని రాత్రికి ప్రతి పాదించాడు. అలాగే "దారి" కవితలో "దారంటే మట్టికదా" అని మొదలెట్టి దానికో ఏడర్థాల్ని ప్రతిపాదించి పందొమ్మిది లైన్లలో 'దారి'ని విశ్లేషించాడు. "మనిషి పెదవులు రెండు" అన్న కవితగూర్చి మరి చెప్పనక్కరలేదు.

మొదటినించీ సమాజంలో ఒక భౌతిక వాస్తవికత ఉంది. దానినుంచి స్పష్టాస్పష్టంగా ఒక భావధార మానవమేధస్సుకి ప్రవహిస్తోంది. దాన్ని కవి తన కవిత్వంలో ప్రతిఫలిస్తాడు. ఈ ఇరవయవ శతాబ్దంలో స్పష్టంగా తాత్విక ధోరణులు ఏర్పడి ఉండగా కవులకిగానీ, రచయితలకి గానీ తమ దారిని ఎన్నుకోవటం తప్పమరి వేరే పనిలేదు. సమాజంలోని పరిస్థితులు భయంకర రూపం దాలుస్తూంటే జనాభిప్రాయం ఉగ్రరూపం దాల్చక తప్పదు. దాన్నే ఈనాడు విప్లవమంటున్నాం. విప్లవంయొక్క రక్తస్వరూపాన్నిచూసి అనేకులు బెంబేలు పడిపోతున్నారు. విప్లవం ఫలించేదాకా దాని రూపం బీభత్సమే, కానీ దాని ఫలితం శాంతి. ఆ స్పష్టత ఉండాలి. శివారెడ్డికి ఆ స్పష్టత ఉందా లేదా అనే వివాదానికి కారణం అదునే.

తానొక సమాజంలో జీవిస్తున్నాడు. పరిస్థితుల్ని గమనిస్తూ జీర్ణించుకుంటూ పోతున్నాడు. కానీ వాటిని తిరిగి ప్రకటించే క్రమంలో కాల్పనిక ప్రకృతిని అవలంబిస్తున్నాడు. దానికి అతనికి ఉన్న విప్లవాభిమానం తోడయింది. కానీ ఫలితం సరిగా ఉంటుందా లేదా అన్నది అతను ఆలోచించదలుచుకోలేదేమో !

అతని లక్షణం ఏమిటంటే కవిత్వ వాతావర్ణాన్ని నిర్మించుకుంటూ పోవటం. "చీమ రెక్కల కింద, రాత్రి నిశ్శబ్దంగా వేళ్ళాడుతుంది" అన్నప్పుడు ఆ నిశ్శబ్దం మనకీ అనుభవానికి వస్తుంది. కళ్లుమూసుకుని పడుకున్న శరీరం కళేబరంగాదు/యుద్ధ నౌక" అంటే ఒక చిత్రం కళ్ళముందు నిలుస్తుంది. "మీచర్మం కింద నులి వెచ్చగా జన్మిస్తున్న ప్రభాతమూ నేనే" అని ప్రకటిస్తున్నపుడు వ్యక్తీకరణలోని నవ్యత ఆశ్చర్యం కలిగిస్తుంది. ఇంత చక్కగా వాతావరణాన్ని నిర్మిస్తూపోయి అపుడపుడూ

అకస్మాత్తుగా దాన్ని తానే చెడగొడుతాడు, పిల్లలు ఇసుక గూళ్లుకట్టి కసా పిసా తొక్కేసినట్టు !

'భూమ్మీద పాదంమోపురావు' అనే కవితని చక్కగానడిపించి సడన్‌గా మళ్ళీ 'భూమ్మీద పాదంమోపుతావు' అని దారి మళ్ళించి పాడుచేస్తాడు. ఈ లక్షణం గూడా అతడిలో సాధారణమే. దీనికి కారణం వుంది. అతనిలో ఉండే ఆవేశం కట్టలు తెంచుకుని పాతేనదిలో కాకుండా ఊటలాగా రావటం. ఊటలోంచి ఒక ఉడగ వచ్చి నెమ్మదిగా పరుచుకున్నాక మళ్ళీ బుడుంగున మరో ఊట వచ్చినట్టుండే అతనిశైలి. "రాత్రిలో మునిగిన అడవి" అనటం అతనికే తగు.

శివారెడ్డి కవిత్వం ద్వారా ప్రత్యక్షంగా పాఠకుడితో మాట్లాడుతాడు. ఈ శైలిని "అనుపత్రిగీతం" నించీ ఆయన స్పష్టంగా ముందుకు తెచ్చాడు. ఇలా రాయటంవల్ల పాఠకుడు కవితో మమేకం అవుతాడు. కవి ఉద్వేగాన్ని తానూ అనుభవిస్తాడు. అయితే భావాల్ని వాచ్యం కాకుండా చూసుకోవాలి. అతని శబ్దరూపాలు గూడా చిత్రంగా ఉంటాయి. "సముద్రాల్ నాటండి" "ఆయుధాల్ తెచ్చుకో" "సుడుల్ తిరిగి" "నల్లతాసై" లాంటివి కావాలని వాడినట్టు కన్పించవు. పుండును "మాంసపుష్పం" అంటాడు. నెత్తురు చుక్కని "వేలిమీద సూర్యోదయం" అంటాడు. అలా అనేప్పుడు గడసు తనం కన్పించకుండా జాగ్రత్త పడతాడు. అది శివారెడ్డికో ఉండే కవిత్వ క్రమ శిక్షణ.

ఒక్కోసారి అతని కవిత్వం విదేశీ కవిత్వం చదువు తున్నట్టుగా ఉంటుంది. మన వాతావరణం, మన సంస్కృతి కాదని పించేలా రాస్తాడు. 'నల్లపిల్ల' కవిత అనువాదమా అనే అనుమానం కలిగించే రచన.

వాస్తవి కతను ప్రకటించే సాహిత్యకృషిలో నూతన రూపశిల్పి శివారెడ్డి అన్న విషయంలో ఎవరికైనా ఏసందేహమూ ఉండనక్కరలేదనటానికి అతని

"ఇంద్ర వల్లులేంఖర్మ - సింగరేణి బొగ్గు గనులేం ఖర్మ
ఎక్కడ దోపిడి వుంటే అక్కడే నూత్న మానవుడు దయిస్తాడు
సిందూరం రక్తచందన రాగాల
రగల్ జండాతో ప్రవేశిస్తాడు"

అన్న వాక్యాలే సాక్ష్యాలు.

— కె. రాంమోహన్ రాజు

---

భారమితి : కె. శివారెడ్డి. పేజీలు 96 .. వెల రూ. 5. ప్రచురణ - దేశిబుక్ డిపో, నారాయణ గూడ, హైద్రాబాద్.

# కె వి ఆర్ పై 'రాజద్రోహ' నేరం

"రాజద్రోహ" నేరం చేయడం ఈనాటికి అఖిలభారత విప్లవ సాంస్కృతిక సమితి ప్రధాన కార్యదర్శి కా॥ కెవిఆర్ వంతు అయింది ఆదికూడా ఆంధ్రప్రదేశ్‌లో తెలుగులో కాదు గోవాలో ఇంగ్లీషులో చేసినట్లు మరాఠీ దినపత్రిక రాసింది. ఈ "రాజద్రోహ" నేరానికి ఆయనను జాతీయ భద్రతా చట్టంక్రింద అరెస్టు చేయాలని ఆ దినపత్రిక సంపాదకీయం గోవా ప్రభుత్వానికి సిఫారసు చేసింది. అయితే గోవా ప్రభుత్వం ప్రస్తుతానికి ఆయనమీద "రాజద్రోహ" నేరం మాత్రం మోపింది. ఇంతకూ విషయమేమిటి?

మే 4, 5 తేదీల్లో గోవాలో జరిగిన ఎ ఐ ఎల్ ఆర్ పి కార్యవర్గ సమావేశంలో పంజాబ్ సమస్యపై ఒక తీర్మానం చేసారు. అందులో స్వర్ణదేవాలయంపై మిలటరీ చర్య, ఆ సాకుతో పంజాబ్ అంతటా కర్ఫ్యూ విధించి సైనికపాలన నెలకొల్పడం, టెర్రరిస్టు చట్టం వంటి అప్రజాస్వామిక చర్యలను ఖండించడం వున్నాయి. అవి పత్రికలకు వివరించే సందర్భంలో కా॥ కె వి ఆర్ జాతుల సమస్యపై మార్క్సిస్టు-లెనినిస్టు దృక్పథాన్ని వివరిస్తూ భారతదేశంలో కేంద్ర ప్రభుత్వం ఒక సమాఖ్యగా ఉండాలనీ, అదికూడా జాతుల నందనోద్యానంగా వుండాలి గానీ, జాతుల బందిఖానాగా వుండకూడదనీ వివరించారు. జాతుల స్వయం ప్రతిపత్తి మొదలుకొని విడిపోయే హక్కుదాకా తాము బలపరుస్తామని కూడా అన్నారు దీనిని ఒకటి రెండు పత్రికలు ఖలిస్తాన్ వాదనను బలపరచడంగా వక్రీకరించాయి. మరో దినపత్రిక కె వి ఆర్ గోవాను కూడా ఇండియన్ యూనియన్ నుంచి విడిపొమ్మని అన్నాడని సంపాదకీయంలో రాసింది గోవాను ఇండియన్ యూనియన్ నుంచి వేరుచేసే కొన్ని క్రైస్తవ మిషనరీల కుట్రలో భాగంగానే ఈ సమావేశం గోవాలో జరిగిందని కూడా ఆరోపించింది.

కా॥ కె వి ఆర్ పైనా, కా॥ సందేశ్ ప్రభు దేశాయ్ (సంఘర్ష నాట్యమంచ్, గోవా, ఎ ఐ ఎల్ ఆర్ పి కార్యవర్గ సభ్యుడు) పైనా గోవా ప్రభుత్వం "రాజద్రోహ" నేరం మోపింది కా॥ సందేశ్ ఇంటిపై పోలీసులు దాడికూడ చేసారు. "గ్రామాలకు తరలండి" ప్రచారంలో పాల్గొని తీవ్రంగా జబ్బుపడి ఆయన ఆ సమయంలో ఆస్పత్రిలో వున్నాడు.

కా॥ కె వి ఆర్‌ను గోవా పోలీసులే వచ్చి తీసుకపోతారో, ఆంధ్ర పోలీసులే పంపిస్తారో కానీ ఈ మూడు నాలుగు నెల్లో ఉద్యోగవిరమణ చేయనున్న కా॥ కె వి ఆర్ గోవా సముద్ర తీరాన వున్న జైల్లో నిత్యమూ "రాజద్రోహ" నేరం చేస్తున్న ప్రజల చరిత్ర రచిస్తాడని ఆశిద్దాం

—సాహితీ మిత్రులు

**SRJANA Telugu Monthly** **July-Sept. 1985**

Regd No. with Registrar of Newspapers 10953/67 H/HNK-3



కారంచేడులోన ఉయ్యాలో
కలదు ఒక్కపల్లె ..
పల్లెంటె పల్లెకాదు ..
వాళ్ళ గుండెల్లో బల్లెము ..
కష్టజీవులు వాళ్ళు ..
కట్టుబాటునోళ్ళు ..

ఒక్క మాటమీద ఉయ్యాలో
కట్టుబడీ వుంటారు ..
మాటపడని యట్టి ..
మాదిగన్నలు వాళ్ళు ..
తిట్టినా కొట్టినా ..
తిరగబడి తీర్తారు ..

This issue Rs. 4-00